సూర్య నేటి దినపత్రిక

www.suryaa.com

ఆదివారం

16 ఏప్రిల్ 2017


# కొరియా ద్వీప కల్పంలో యుద్ధ మేఘాలు

China

Russia

North

South Korea





mohan PUBLICATIONS
Granthanidhi.blogspot.in
ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట, రాజమహేంద్రవరం – 533 101.
Mohanpublications.com
SUNDAY SPECIAL MAGAZINES
గ్రంథనిధి






# చైర్మన్‌తో ముఖాముఖి



నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**యూపీ లో యోగి ఆదిత్యనాథ్ పాలనను మీరెలా చూస్తున్నారు.**

యూపీ అసెంబ్లీ ఎన్నికల్లో అక్కడి ప్రజలు బిజెపి కి పూర్తి మెజార్టీ ఇచ్చారు. పార్టీ రాష్ట్రంలో తిరుగులేని శక్తిగా ఆవిర్భవించింది. కుల,మతాలకు సంబంధం లేకుండా ప్రజలు బిజెపి పక్షాన నిలి చారన్నది ఫలితాల్లో స్పష్టమయింది. అయితే బిజెపి ముఖ్య మంత్రి అవకాశాన్ని యోగి ఆదిత్యనాథ్ కు ఇచ్చింది. దీంతో ఇంతకాలం యోగిగా, ఎంపిగా ఉన్న ఆదిత్య నాథ్ ఇప్పుడు యుపికి ముఖ్యమంత్రి అయ్యారు. అత్యంత బాధ్యతాయుతమైన పద విలో ఆయన కొనసాగుతున్నారు. ముఖ్యమంత్రి పదవిలో వ్యక్తి గత నడవడికలేమీ ఉండవు. ఎవరు అధికారంలో ఉన్నా రాజ్యాంగం ప్రకారం నడుచుకోవా ల్సిందే. అందుకు భిన్నంగా నడిచేందుకు అవకాశం లేదు. ఇంతవరకు హిందూమతానికి ప్రతీకగా ఉన్న యోగి ముఖ్య మంత్రి అయినా ఆయన ఇతర మతాలకు ఇబ్బంది కలిగించే నిర్ణయాలేవీ తీసుకునే అవకాశం లేదు. భార్యా, పిల్లలు, సంసార జంజాటం లేని వ్యక్తి యోగి కాబట్టి ఆయన పాలన స్వచ్ఛంగానే ఉండే అవకాశాలున్నాయి. గతంలో ఎలాంటి బాధ్యతలూ లేవు కాబట్టి ఆదిత్యనాత్ అనేక ప్రకటనలు చేసి ఉండవచ్చు. ఇతర కార్యక్రమాల్లో కూడా భాగం కావచ్చు. కానీ ఇప్పుడలా కాదు. ఆయన తన ఇష్టానుసారం మాట్లాడే అవ కాశం లేదు. ఇష్ట ప్రకారం ఏదైనా చేసేందుకు వీలు కాదు. కాబట్టి రాజ్యాంగ పరిధిలోనే ఆయన పాలన సాగాలి.

అయితే కొన్ని నిర్ణయాలు మాత్రం ఆయన తీసుకోవచ్చు. యూపిలో గోహత్య నిషేధం, కబేళాల మూసివేత లాంటి నిర్ణయాలు కొంత గందరగోళాన్ని సృష్టించాయి. అయితే ఈ నిర్ణయాలు యోగి కేవలం మతకోణం నుంచి తీసుకున్నవేమీ కాదనిపిస్తున్నది.

ఇక పాలనలో కూడా ఆయన అనేక సంస్కరణలు చేపట్టారు. పెండింగ్ ఫైళ్ళ దుమ్ము దులిపి పరిష్కార మార్గాలు కనుగొంటున్నారు. ప్రజలతో సఖ్యంగా ఉండి వారి సమస్యలను స్వయంగా తెలుసుకునేందుకు ప్రాధాన్యత ఇస్తున్నారు. అధికారులను, మంత్రులను ఉరుకులు పరుగులు పెట్టిస్తున్నారు. హోంశాఖ తన వద్దే ఉంచుకున్న యోగి ఆదిత్యనాథ్ పోలీస్ స్టేషన్‌లను కూడా ఆకస్మికంగా తనిఖీలు చేస్తున్నారు. ప్రజల నుంచి నేరుగా వినతులు స్వీకరిస్తూ పాలనా వ్యవస్థలో సమూల మార్పుల కోసం ప్రయత్నిస్తున్నారు. యోగి ఆదిత్యనాథ్ హిందూ యోగి కాబట్టి ఆయన ముఖ్యమంత్రి కావొద్దు అనే వాదన సరైంది కాదు. గతంలో రాజకీయ ఉద్య మాల్లో ఆయన ఎలాంటి వ్యాఖ్యలైనా చెయ్యొచ్చు. ఆయనపై కేసు లేమైనా ఉండొచ్చు కానీ పార్టీకి పూర్తి మెజార్టీ వచ్చింది కాబట్టి పార్టీ నిర్ణయం మేరకు ఎవరైనా ముఖ్యమంత్రి అయ్యే అధికారం ఉంటుంది. అందులో భాగంగానే యూపి ముఖ్యమంత్రి గా యోగి ఆదిత్యనాథ్ పీఠమెక్కారు.

ఆయన పాలనతీరు ఇప్పటి వరకైతే బాగుందనే చెప్పాలి. ఎప్పుడూ ప్రజల మధ్యనే ఉండే యోగి కి ప్రజా సమస్యలు క్షుణ్ణంగా తెలుసుకాబట్టి వాటి పరిష్కారానికి ఆయన చొరవ తీసుకునే అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఇప్పుడయితే యోగి స్పీడ్ బాగానే ఉంది. అధికారులు ఆయన స్పీడ్‌ను అందుకుని పనిచేయగల్గితే యూపీ కి మంచి రోజులు వచ్చినట్లే.

**ఆంధ్రప్రదేశ్‌లో మంత్రివర్గ విస్తరణ ఉంటుందా... ఉంటే మీ అభిప్రాయం ఏమిటి.**

ఇప్పటికే ప్రభుత్వం ఏర్పడి మూడేళ్ళు అవుతుంది. మంత్రి పదవుల కోసం సీనియర్లు కూడా ఎదిరిచూస్తున్నారు. చాలా మంది అర్హులైన వారికి కూడా గతంలో మంత్రులుగా పనిచేసిన వారికి కూడా ఈ సారి అవకాశం రాలేదు. కాబట్టి అలాంటి వారి కోసం మంత్రివర్గ విస్తరణ అవసరం ఎంతైనా ఉంది.

ఇప్పటి వరకు మంత్రులుగా ఉన్న వారు వారివారి శాఖల్లో ఏమేరకు పనితీరు కనపర్చారు. ప్రజానీకానికి అందుబాటులో ఉన్నారా, ప్రభుత్వం చేపడుతున్న కార్యక్రమాలను ప్రజల్లోకి తీసుకుపోయారా అన్న అంశాల ఆధారంగానే మంత్రుల పనితీరును ముఖ్యమంత్రి బేరీజు వేస్తారు. ఇలా చూసినపుడు కొందరు మంత్రుల పనితీరు బాగా లేదనే నివేదికలు వచ్చాయి. కొందరు ప్రజలకు అందుబాటులో ఉండటం లేదన్న వాస్తవాలు తెలిసాయి. అలాంటి వారిని తప్పించి ప్రజా క్షేత్రంలో ఉండేవారికి అవకాశం కల్పించడం మంచిదే. ఇక కొత్తగా ఎమ్మెల్సీలు అయిన వారు కూడా మంత్రి పదవులను ఆశిస్తుండవచ్చు అలాంటి వారికి అవ కాశం కల్పించాల్సి ఉంటుంది. ముఖ్యంగా సిఎం కుమారుడు నారా లోకేష్ ఎమ్మెల్సీ అయ్యారు. కాబట్టి ఆయన్ను మంత్రివర్గం లోకి తీసుకునే అవకాశాలు ఎక్కువ. ఇక కులాల సమతూకంలో కూడా గతంలో కొన్ని కులాలకే పదవులు దక్కాయి ఇప్పుడు వారిని తప్పించి పదవి దక్కని కులాలకు ప్రాధాన్యత ఇవ్వాల్సి ఉంటుంది. ప్రభుత్వానికి ఇంకా రెండు సంవత్సరాలే మిగిలి ఉంది. అంటే వచ్చేదంగా ఎన్నికల తయారీకి ప్రణాళికలు వేయాల్సిందే. ప్రజల్లోకి వెళ్లాల్సిందే. ఇప్పుడు చేసిన అభివృద్ధి కార్యక్రమాలను చెప్పడంతో పాటు, రాబోయే రోజుల్లో ఎలాంటి కార్యక్రమాలు రూపొందించాలన్నదానిపై మంత్రివర్గం దృష్టి సారించాల్సి ఉంటుంది. ఇందుకోసం ఇప్పుడు మంత్రివర్గ విస్తరణ చాలా అవరమనే ప్రభుత్వం భావిస్తున్నది. టిడిపి లోని ముఖ్యులకు ఈ సారి పదవులు లభించే అవకాశాలుంటాయి. పార్టీ కోసం ఎంతోకాలంగా పనిచేస్తున్న నాయకులకు పదవులు ఇవ్వా లన్నదే ప్రభుత్వ ఉద్దేశం.

**తెలంగాణాలో కూడా మంత్రివర్గ విస్తరణ ఉంటుందంటారా....**

ఆంధ్రప్రదేశ్ మాదిరే తెలంగాణాలో కూడా ప్రభుత్వం ఎన్నికలకు సిద్ధం కావాల్సిన అవసరం ఉంది. పార్టీలో పనిచేసిన ఎంతో మందికి ఇంతవరకు మంత్రివర్గంలో స్థానం లభించలేదు. అలాంటి వారికి కార్పోరేషన్ పదవులిచ్చి ముఖ్యమంత్రి సంతృప్తి పరుస్తున్నా ఇంకా కొందరు నాయకులు మంత్రి పదవులకోసం ఎదురు చూస్తూనే ఉన్నారు. అలాంటి వారికి పదవులు ఇవ్వా ల్సిందే...అయితే మంత్రివర్గ విస్తరణపై ఇప్పటికిప్పుడు కాకపో యినా వరంగల్ లో జరిగే పార్టీ సభ తర్వాతనైనా ముఖ్యమంత్రి దృష్టి సారించే అవకాశాలున్నాయి.

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

## లెజెండ్

# రిచర్డ్ విల్‌స్టారర్

**పెర్కిన్ సాధించిన విజయం తరువాత ఇంకా ఇంకా సంక్లిష్టమైన సహజ సమ్మేళనాలని కృత్రిమంగా సంయోజించే ప్రయత్నాలు జరిగాయి. అయితే ఇండిగో వంటి అరుదైన సందర్భాలలో తప్ప, వ్యాపార దృష్టితో చూసినప్పుడు, ఈ సంయోజిత సమ్మేళనాలు సహజ సమ్మేళనాలతో పోటీ పడలేకపోయాయి. అయినా కూడా సంయోజనం వల్ల కొన్ని లాభాలు లేకపోలేదు. సంయోజనం చేత పదార్థాల అణువిన్యాసాన్ని నిర్ధారించుకోడానికి వీలయ్యింది. అణువిన్యాసం తెలిస్తే అందుకు సైద్ధాంతిక ప్రయోజనాలే కాక, ఎన్నో ప్రాపంచిక ప్రయోజనాలు కూడా ఉన్నాయి. అలాంటి ఒక తార్కాణంగా జర్మన్ రసాయన శాస్త్రవేత్త రిచర్డ్ విల్‌స్టాటర్ (1872–1942) సాధించిన విజయాన్ని చెప్పుకోవచ్చు.**



మొక్కల్లో ఉండే క్లోరోఫిల్ పదార్థం కాంతిని లోనికి గ్రహించగలుగుతుంది. ఈ అణువు వల్లనే కాంతిలోని శక్తిని వాడి కార్బన్ డయాక్సయిడ్ నుండి కార్బోహైడ్రేట్‌ని ఉత్పత్తి చెయ్యడానికి వీలవుతుంది. హైన్రిచ్ ఆటో వీలాండ్ (1877–1957) మరియు అడోల్ఫ్ విం డౌస్ (1876–1859) స్టీరాయిడ్‌ల యొక్క, తత్సంబం ధిత ఇతర సమ్మేళనాల యొక్క అణువిన్యాసాలని శోధిం చారు. (స్టీరాయిడ్ ల జాతికి చెందిన రసాయనాలలో ఎన్నో ముఖ్యమైన హార్మోన్లు ఉన్నాయి.) ఆటో వాలాక్ (1847–1931) అనే మరో జర్మన్ రసాయన శాస్త్రవేత్త ఎంతో ప్రయాసపడి టర్పీన్లు అనబడే వృక్షతైలాల అణువిన్యాసాన్ని తెలుసుకున్నాడు. (అలాంటి తైలాల కుటుంబంలో మెథనాల్ ఓ ముఖ్యమైన ఉదాహరణ.) అలాగే హన్స్ ఫిషర్ (1881–1945) అనే మరో రసాయన శాస్త్రవేత్త నెత్తుటికి ఎర్రనిరంగు నిచ్చే హీమ్ అనే అణువు యొక్క విన్యాసాన్ని శోధించాడు. విటమిన్లు, హార్మోన్లు, ఆల్కలాయిడ్లు మొదలగు రసాయన జాతులన్నీ ఇరవయ్యవ శాతాబ్దంలో శోధించబడ్డాయి. వాటిలో ఎన్నో అణువుల విన్యాసం తేటతెల్లమయ్యింది. ఉదాహరణకి 1930లలో స్విస్ రసాయన శాస్త్రవేత్త పాల్ కారర్ (1889–1971) కెరటినాయిడ్ లు అనబడే జాతికి చెందిన రసాయనాల అణు విన్యాసాన్ని శోధించాడు. ఇవి చెట్ల నుండి పుట్టే అద్దకాల జాతి. వీటికి విటమిన్ ఏ కి సన్నిహితమైన సంబంధం వుంది.

బ్రిటిష్ రసాయన శాస్త్రవేత్త రాబర్ట్ రాబిన్సన్ (1886–1975) ఆల్కలాయిడ్‌లని క్రమబద్ధంగా శోధించాడు. ఇతడు సాధించిన అత్యుత్తమ విజయం 1925లో మార్ఫిన్ అణువిన్యాసాన్ని ఛేదించడం. (ఒక్క పరమాణువు వద్ద మాత్రం అతడు పొరబడ్డాడు.) అలాగే 1946లో అతడు స్ట్రిక్నిన్ విన్యాసాన్ని శోచించాడు. రాబిన్సన్ సాధించిన విజయాలని తదనంతరం అమెరికన్ రసాయన శాస్త్రవేత్త రాబర్ట్ బర్న్స్ వుడ్వర్డ్స్(1917–1979) నిర్ధారిం చాడు. వుడ్వర్డ్ తన అమెరికన్ సహోద్యోగి అయిన విలి యమ్ ఫాన్ ఎగ్గర్స్ డోయరింగ్ (1917–2011)తో కలిసి రసాయనిక సంయోజనలో ప్రయత్నాలు మొదలెట్టాడు. ఇరువురూ కలిసి 1944 లో క్వైనైన్‌ని సంయోజించారు. ఆ విధంగా ఆదిలో పెర్కిన్ తలపెట్టి సాధించలేకపోయిన లక్ష్యాన్ని ఈ అమెరికన్ రసాయన శాస్త్రవేత్తలు సాధించారు. వుడ్వర్డ్ ఇంకా ముందుకి వెళ్లి మరింత జటిలమైన అణువులని కూడా సంయోజించాడు. 1951 లో అతడు కొలెస్టరాల్ (ఇదొక సర్వసామాన్యమైన స్టిరాయిడ్)ని సంయోజించాడు. అదే ఏడాది అతడు కార్టిసోన్‌ని కూడా సంయోజించాడు. ఇదొక స్టిరాయిడ్ హార్మోన్. 1956లో అతడు రిసెర్పీన్‌ని సంయోజించాడు. మత్తు మందుల్లో ఇది మొదటిది. 1960 లో ఇతడు క్లోరోఫిల్‌ని సంయోజించాడు. 1962లో అతడు ఓ ప్రత్యేకమైన, సంక్లిష్టమైన సమ్మేళనాన్ని సంయోజించాడు. ఆ సమ్మేళనానికి ఆంటీబయాటిక్ అక్రోమైసిన్‌తో సంబంధం వుంది.

మరో నవ్య దిశలో కృషి చేస్తున్న రష్యన్–అమెరికన్ రసాయన శాస్త్రవేత్త ఫోబస్ ఆరన్ థియోడోర్ లెవీన్ (1869–1940) న్యూక్లియోటైడ్‌లు అనబడే అణువుల కుటుంబాన్ని శోధించాడు. (జన్యువులకి మూర్తిరూపాలైన డీ.ఎన్.ఏ. అణువులలో ఇవి ముఖ్యాంశాలు). అతడి పరిశోధనా ఫలితాలని తదనంతరం స్కాటిష్ రసాయన శాస్త్రవేత్త అలెగ్జాండర్ రాబర్టస్ టాడ్ (1907–1997) నిర్ధారించాడు. 1940, 1950 లలో ఇతగాడు వివిధ న్యూక్లియోటైడ్ లని, తదితర అణువులని, సంయోజించాడు.

అలా సంయోజించబడ్డ అణువులలో ఆల్కలాయిడ్‌ల వంటి అణువులకి ఎన్నో వైద్య ప్రయోజనాలు ఉన్నాయి. అందుకే ఔషదాలు అనే కుటుంబంలోకి ఈ సమ్మేళనాలని చేర్చవచ్చు. పూర్తిగా కృత్రిమంగా సంయోజించబడ్డ సమ్మేళనాలకి కూడా అలాంటి ప్రయోజనాలు ఉంటాయని, వాటిని కూడా మందుల లాగా వినియోగించవచ్చని ఇరవయ్యవ శతాబ్దపు తొలిదశలలోనే గుర్తించారు. అలా సంయోజించబడ్డ ఆర్స్ఫినమిన్ అనే సమ్మేళనాన్ని 1909 లో జర్మన్ బాక్టీరియాలజిస్ట్ అయిన పాల్ ఎహర్లిక్ (1854–1915) సిఫిలిస్ వ్యాధికి మందుగా వాడాడు. ఈ మొదటి మెట్టే రసాయనిక చికిత్స అనే సాంప్రదాయానికి పునాది అయ్యింది అంటారు. ప్రత్యేక రోగాలకి ప్రత్యేక మందులని వాడి చికిత్స చేసే పద్ధతినే కెమోథెరపీ అంటారు.





జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్



నవకవిత్వం

## ఆజన్మాంతం వరమే...

అమ్మతనం పాతబడదు
అమ్మ భాష మరుగుపడదు
తేనెకన్నా మధురం
విరుల కాన్న సుందరం
తరతరాల కీర్తి కిరీటం
మాతృభాష!...

వర్షించే తమస్సు మేఘం
ఉదయించే ఉషస్సు వేకువ
గట్టుపై చేసే పాలపిట్ట అరుపు
చెట్టుపై కూసే కోకిల కూత
అప్పుడు ఇప్పుడు ఎప్పుడూ
ఒక్కటే!...

కడుపు మండించే ఆకలి
సిరులు పండించే పొలాలు
ఏనాటివైనా...
మౌళిక భావనలో మార్పులేమీ
లేవు!...

పరభాషా వ్యామోహంలో పడి
పాతదంటూ...
ప్రయోజనం శూన్యమంటూ...
వట్టి పిట్ట కథలు వినొద్దు
మాతృ భాషకు మచ్చ తేవద్దు!...

విలువైన విద్యాభ్యాసానికి
మాతృ భాషే సరైన పునాది
కాదని కాలరాస్తే
కోరుకున్న వికాసం సమాధే!...

కొత్తనీటిని తనలో కలుపుకొని
కదిలి వెళ్లే జలధి.. మాతృ భాష
తెలుగు వారికే కాదు
మానవాళికే మేలు చేసే
మహోన్నత తరువు.. మాతృ
భాష!...

పూర్వ జన్మ సుకృత ఫలం
మన తెలుగు భాష
ఈ జన్మకే గాదు
ఆజన్మాంతం వరమే!...

- కొండూరు వెంకటేశ్వరరాజు, గూడూరు

## రన్నింగ్ వాయిస్

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షి ఎకలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.




ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

## 'కూని'రాగాలు

భయం జీవిత గమనాన్ని మారుస్తుంది..!
గేయం బతుకు అర్థాన్ని వివరిస్తుంది..!!

కలవరపాటు మాటలు కచ్ఛితం కావు..!
తొందరపాటు పనులు యోగ్యం కాదు..!!

అనుమానంతో మనసును గెలవలేము..!
అభిమానంతో అనురాగం పెంచగలము..!!

కలిసిరాకుంటే ఏదైనా కఠినమే..!
వలచివద్దంటే ఎవరైనా భగ్నమే..!!

గద్దె నెక్కితే గొప్పవారుకారు..!
పద్ధతి నేర్చితే చిరకాలముంటారు..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### వింతలు విశేషాలు

★★★

**చెప్పుకుంటూ పోతే...సోదవుతుంది**

కూనిరెడ్డి శ్రీనివాస్ కవితలు హృదయాలను కదిలిస్తున్నాయి. చెప్పకపోతే బరువౌతుంది చెబితే సోదవుతుంది అంటూ ఆయన తన కవితా సవ్యసాచిత్వాన్ని వారం వారం రంజుగా సంధిస్తున్నారు. ఎంతైనా ఆయన కవితల సవ్యసాచి. ఆయన కలానికి రెండు వైపులా పదునే...ఎంతో సెటైరికల్‌గా ఉండటం విశేషం. హ్యాట్సాఫ్ టూ కూనిరాగాలు...ఈ వారం వావ్‌లో వెనకపేజీ కామెంట్స్ తెగ నవ్విచ్చాయి. పాటలు అన్నీ సరిగ్గా అతికినట్లు సరిపోవడం విశేషం.

**వెంకటేష్, ఏలూరు**

★★★

**కళాత్మకంగా వార్తలు...**

టివి9లో కళాత్మకంగా వార్తలు చదివే దీప్తి...వాచకంటోనూ గ్రేటే...ఈ వారం వుమన్‌పవర్‌లో ఆమె గురించి ఇచ్చిన వ్యాసం బాగుంది. జైళ్లలో భద్రత గురించి శ్యాంమోహన్ ఇచ్చిన సెటైరికల్ భేతాళ కథలు హాయిగా నవ్వుకుంటానికి బాగుంటున్నాయి. పాలకులకు కనువిప్పు కలిగించేవిధంగా ఉంటున్నాయి. సావిత్రి న్యూమరాలజీ విషాధకరంగా ఉండటం బాధాకరం. ఆమె గొప్ప నటి.

**ముకుంద, భీమునిపట్నం**

ఫన్ ఛ్







నారు




కోరికలు లేనివాడు ఎప్పుడూ ధనం, అధికారం కోరడు. వివేకం లేనివాడు ప్రియమైన మాటలు మాట్లాడనేరడు. అలాగే కపటం లేనివాడు మోసం చేయలేడు. -హితోపదేశ




# ఎవెంజర్స్




**ఐరన్‌మాన్, హల్క్, థోర్, కెప్టెన్ అమెరికా– వీళ్ళంతా అతీత శక్తులు కలిగిన బల సంపన్నులు. వీళ్ళ సాహసాలను చిత్రీకరిస్తూ సీరిస్‌గా సినిమాలు వచ్చాయి. ఒక్కొక్కరి సాహసాలే వర్ణించ వీలులేని కథనాలుగా తయారయితే, వీరంతా కలిసి నటిస్తే ఎలా వుంటుందో ఊహించగలమా? అలాటి అసాధ్యాన్ని సుసాధ్యంచేసిన చిత్రమే ఎవెంజర్స్.సూపర్ హీరో టీమ్‌తో వచ్చిన ఎవెంజర్స్ మార్వెల్ కామిక్స్ ఆధారంగా రూపొందింది.**

రాబర్డ్‌డాన్ జూ., క్రిస్ ఇవాన్స్, మార్క్ రఫెల్, క్రిస్ హెమ్స్‌వర్త్, స్కార్లెట్ జాన్సన్, జెరెమ్ రెన్నర్ తదితరులు నటించిన ఎవెంజెర్స్ చిత్రానికి నిర్మాత కెవిన్ ఫీజ్. ఇక సంచలనం సృష్టించిన ఎవెంజెర్స్ చిత్రానికి దర్శకత్వం మరియు స్క్రీన్‌ప్లే సమకూర్చింది జోస్ వేడాన్.

ఐరన్‌మాన్, హల్క్, థోర్, కెప్టెన్ అమెరికా– వీళ్ళంతా అతీత శక్తులు కలిగిన బల సంపన్నులు. వీళ్ళ సాహసాలను చిత్రీకరిస్తూ సీరిస్‌గా సినిమాలు వచ్చాయి. ఒక్కొక్కరి సాహసాలే వర్ణించ వీలులేని కథనాలుగా తయారయితే, వీరంతా కలిసి నటిస్తే ఎలా వుంటుందో ఊహించగలమా? అలాటి అసాధ్యాన్ని సుసాధ్యంచేసిన చిత్రమే ఎవెంజర్స్. సూపర్ హీరో టీమ్‌తో వచ్చిన ఎవెంజర్స్ మార్వెల్ కామిక్స్ ఆధారంగా రూపొందింది.

షీల్డ్ అనే గూఢచారి విభాగానికి డైరెక్టర్ అయిన నిక్‌ఫ్యూరీ తన ఆధ్వర్యంలో జరిగే టెస్సిరాక్ట్ అనే పదార్థంపై జరిగే పరిశోధనలను పర్యవేక్షిస్తుంటాడు. సముద్రగర్భంలో దొరికిన టెస్సిరాక్ట్ అనే పదార్థం అతి శక్తివంతమైనదనీ, అది శక్తివంతమైన భూమినుండి రోదసికి మార్గం ఏర్పరచగా, ఆ మార్గంగుండాలోనికి ప్రవేశించిన ఇతర గ్రహానికి చెందిన నోర్స్‌గాడ్‌లోకి అక్కడమారణకాండ సృష్టించి ఆ టెస్సిరాక్ట్‌ను ఎత్తుకుపోతాడు. తనను ఎదిరించిన వాళ్ళను వశీకరణ విద్యతో బానిసలుగా చేసుకుంటాడు. దుర్మార్గుడైన లోకి టెస్సిరాక్ట్ సహాయంతో భూలోకాన్ని వశపరుచుకునే ప్రమాదం వుందని గ్రహించిన నిక్‌ఫ్యూరీ, ఆ బలవంతుడైన గ్రహాంతరవాసి ఆటకట్టించడానికి లోక రక్షణార్థమైన హల్క్, ఐరన్‌మాన్, కెప్టెన్ అమెరికా, థోర్‌ల సహాయాన్ని అర్థిస్తాడు. వీళ్ళు మొదట తమ ఆధిక్యతా ప్రద ర్శనలతో పోట్లాడుకున్నా, లోక రక్షణ బాధ్యతను గుర్తించి కలిసికట్టుగా పోరాడటానికి నిశ్చయించుకుంటారు.

టెస్సిరాక్ట్‌ను నియంత్రించడానికి జర్మన్ వచ్చి ఇరిడియంను దొంగిలించినలోకి అక్కడ బీభత్సాన్ని సృష్టించి, బెదిరిపోయిన ప్రజలను తనకు విధేయులుగా మోకరిల్లమంటాడు. ఐరన్‌మాన్, కెప్టెన్ అమెరికా, థోర్‌లు అతనితో యుద్ధంచేసి బందీగా పట్టుకుని షీల్డ్ విమానంలో అనగా ఫ్లైయింగ్ ఎయి క్రాఫ్ట్ కారియర్‌లో తీసుకువెళతారు. నోర్స్ గాడ్ మెరుపుదేవత కుమారుడైన థోర్, లోకి సహోదరుడు. అ త డి ౨

ఫైటింగ్‌లు,
యాక్షన్ సీన్లు ఫాస్ట్‌గా వుండి ఇది
సర్కసా, వీడియో గేమా అన్న అనుమానం
కలుగుతుంది. మొత్తానికి ఫొటోగ్రఫీ, స్పెషల్
ఎఫెక్ట్స్ ఈ చిత్రానికి ప్రాణం పోశాయి.
నమ్మశక్యంకాని కథావస్తువు అయినప్పటికీ
చిత్రీకరణ ఆకట్టుకు విధంగా వుండి
అలరిస్తుంది.

సన్మార్గంలోకి తేవాలని ప్రయత్నిస్తుంటాడు. లోకిని ఎలా నియం త్రిం చాలో, టెస్సిరాక్ట్ శక్తితో ఆయుధాలను ఎలా తయారుచేయాలా అని ఆలోచించే షీల్డ్ ప్రణాళిక గురించి లోక రక్షకులు చర్చించుకుంటారు.

మెక్సికోలో ఇతర గ్రహవాసులనుండి భూమికి ఎదురయ్యే ప్రమాదాన్ని నివారించడంలో టెస్సిరాక్ట్‌ను ఎలా ఉపయోగించుకుని వాళ్ళను భయభ్రాంతులను చేశారో నిక్‌ఫ్యూరీ వివరిస్తాడు. ఇతర గ్రహం నుండి వచ్చినలోకి అనుచరులు ఎయిర్ క్రాఫ్ట్ కారియర్ మీదకు దాడిచేసి దాని ఇంజన్లను చెడగొడతారు. ఐరన్‌మాన్, కెప్టెన్ అమెరికా కలిసి ఆ

| | | |
|---|---|---|
| MOVIE | : | AVENGERS |
| Directed by | : | Joss Whedon |
| Produced by | : | Kevin Feige |
| Screenplay by | : | Joss Whedon |
| Story by | : | Zak Penn<br>Joss Whedon |
| Based on | : | The Avengers<br>by Stan Lee<br>Jack Kirby |
| Starring | : | Robert Downey<br>Jr.Chris Evans<br>Mark Ruffalo<br>Chris Hemsworth |
| Music by | : | Alan Silvestri |
| Cinematography | : | Seamus McGarvey |
| Edited by | : | Jeffrey Ford<br>Lisa Lassek |
| Production company | : | Marvel Studios |
| Distributed by | : | Walt Disney<br>Studios Motion<br>Pictures1 |
| Release dates | : | April 11, 2012 |
| Running time | : | 143 minutes[1] |
| Country | : | United States |
| Language | : | English |
| Budget | : | $220 million[2] |
| Box office | : | $1.520 billion[3] |

ఇంజన్లను బాగుచేస్తూ, శత్రువులతో పోరాడుతుంటారు. లోకి చెరలోనుండి నేర్పుగా తప్పించుకుని, అందులోకిథోర్‌ను రప్పించి, ఆ జైలు గదినిఆకాశంలోకి విసిరేస్తాడు. అది వేగంగా

వచ్చి భూమిని ఢీకొట్టే లోపల థోర్అందులోంచి తప్పుకుంటాడు. లోకితననుతాను భూమికి అధిపతిగా ప్రకటించుకుం టాడు. టెస్సిరాక్ర్త ప్రభావంతో తనలోకంనుండి అమెరికాలోని మాన్‌హట్టన్‌కు దారి ఏర్పరుస్తాడు. టెస్సిరాక్ట్ డివైస్‌నుస్వాధీనం చేసుకొని ఆ మార్గాన్ని మూసివేయడానికి కొందరు మిత్రులు ప్రయత్నిస్తుండగా, మరికొందరుమిత్రులు గ్రహాంతర వాసులనుఎదుర్కొంటారు. పై అధికారులు ఆ

మార్గాన్ని నాశనం చేయడానికి న్యూక్లియర్ మిస్సైల్స్‌ను ప్రయోగిస్తారు.జరుగనున్న ప్రమాదాన్ని పసిగట్టిన ఐరన్‌మాన్ ఆ మిస్సైల్‌ను జాగ్రత్తగాపట్టుకుని ఆ సొరంగ మార్గం మధ్యలోకిపంపి దాన్ని ధ్వంసం చేస్తాడు. దానినాశనంతో గ్రహాంతర వాసులంతాచనిపోతారు. లోకి, థోర్‌లు వాళ్ళలోకానికి– రక్షకులంతా వాళ్ళవాళ్ళ స్వస్థలాలకు వెళ్ళిపోవడంతో సినిమా ముగుస్తుంది.

ఐరన్‌మాన్, హల్క్, థోర్, కెప్టెన్అమెకాలతోపాటు హల్ఐ అనే విలువిద్యా నిపుణుడు, బ్లాక్ విడో అనే సుశిక్షితురాలైన లేడీ ఏజంట్ కూడా ఈఆపరేషన్‌లో పాల్గొంటారు. ఈ ఆరుగురికివిలన్‌తో పోట్లాడే అవకాశం లేకపోవడంవల్ల వాళ్ళలోవాళ్ళేపోట్లాడుకుని ప్రేక్షకులకు వినోదాన్ని కలిగిస్తారు.

ఫైటింగ్‌లు, యాక్షన్ సీన్లు ఫాస్ట్‌గా వుండి ఇది సర్కసా, వీడియో గేమా అన్న అనుమానం కలుగుతుంది. మొత్తానికి ఫొటోగ్రఫీ, స్పెషల్ ఎఫెక్ట్స్ ఈ చిత్రానికి ప్రాణం పోశాయి. నమ్మశక్యంకాని కథావస్తువు అయినప్పటికీ చిత్రీకరణ ఆకట్టుకు విధంగా వుండి అలరిస్తుంది.







రేపటి వాస్తవమే ఆదర్శం. అంతేకాని అది మరెక్కడో లేదు. -జవహర్‌లాల్ నెహ్రూ



తెర వెనుక నాయకుడు

బాపు దర్శకత్వం వహించిన వంశవృక్షం చిత్రంతో ఆయన ఎడిటర్‌గా చలన చిత్రసీమకు సుపరిచితులయ్యారు...నాటి నుంచి దర్శకుడు బాపు ప్రతి చిత్రంలోనూ ఎడిటర్ – అనిల్ మల్నాడ్ పేరు తప్పనిసరైంది... వంశీ తీసిన సితార చిత్రానికి 1985లో ఉత్తమ ఎడిటర్ జాతీయ పురస్కారం అందుకున్నారు. పలు భాషా చిత్రాలకు ఎడిటర్‌గా నేటికీ చురుగ్గా పనిచేస్తున్నారు... మీడియాకు, పబ్లిసిటీకి దూరంగా ఎంతో సింపుల్‌గా ఉండే ఎడిటర్ అనిల్ మల్నాడ్ గురించి తెలుసుకుందాం...



# బాపు పెంచిన వృక్షం

## ఎడిటర్ అనిల్ మల్నాడ్



అసలు పేరు జి.ఆర్. దత్తాత్రేయ. తమిళులు దత్తాత్రేయ పదం పలకలేకపోయారు. అందువల్ల సులువుగా ఉండేలా అనిల్ దత్ అని పిలిచేవారు. అనిల్ పుట్టిన ప్రాంతం పేరు మల్నాడు. ఆ ప్రాంతం పేరును కలుపుకుని అనిల్ మల్నాడ్‌గా స్థిరపడ్డారు. తన సొంత కృషిని నమ్ముకుని ఇండస్ట్రీలో ఎటువంటి గాడ్ ఫాదర్ లేకుండా ఎదిగారు అనిల్ మల్నాడ్.

**సంపూర్ణ రామాయణం:** అనిల్ తన 17వ ఏట 1970లో క్రియేటివ్ దర్శకుడు బాపు దగ్గర శోభన్‌బాబు, చంద్రకళ నటించిన సంపూర్ణరామాయణం చిత్రానికి అసిస్టెంట్ దర్శకుడిగా చేరారు. అసలు ఆయన లక్ష్యం సినిమాలకు కెమెరామెన్ అవుదామనే. అందుకని చెన్నై వచ్చేశాడు. అయితే కెమెరామెన్‌గా అనుకుంటే ఆఖరుకు ఎడిటింగ్ విభాగంలో సెట్ అయ్యాడు. ఎడిటింగ్‌లో అవకాశం వచ్చింది కదా అని ఏ మాత్రం ఆలోచించకుండా అసిస్టెంట్‌గా చేరిపోయాడు అనిల్.

**అగ్రదర్శకులతో:** ఎందరో అగ్రదర్శకుల వద్ద ఎటువంటి అరమరికలు లేకుండా తన కెరీర్ సాగించాడు అనిల్ మల్నాడ్. బాపు, వంశీ, గీతాకృష్ణ, రాఘవేంద్రరావు వంటి చాలామంది దర్శకులతో పనిచేశారు. అలాగే తమిళంలో ఆర్‌వీ. ఉదయ్‌కుమార్, ఆర్.కె.సెల్వమణి... వీరిద్దరి వద్దా ఎక్కువగా ఎడిటింగ్ విభాగంలో చేశారు. వీళ్లే గాక ఇంకా మణివ ణ్నన్, మనోబాల... వంటి కోలీవుడ్ మేటి దర్శకులు అనిల్ వర్క్‌ని బాగా ఇష్టపడేవారు.

చదువుకునే రోజుల్లోనే కన్నడ, తుళు, కొంకిణి, తమిళం, తెలుగు, హిందీ భాషలు నేర్చుకున్నారు అనిల్. నేర్చుకున్న విద్య ఏదీ వృథా పోదు అని పెద్దలు చెప్పినట్లుగా, ఆనాడు అనిల్ నేర్చుకున్న భాషలు వివిధ భాషల్లో ఎడిటింగ్‌కు ఎంతగానో తోడ్పడ్డాయి అనిల్‌కి. పని చేయాలనే పట్టుదల ఉంటే ఏదైనా సాధించగలమంటారు అనిల్. వృత్తిని దైవంగా భావించి అంకితభావంతో పనిచేయడం అనిల్ నైజం. సినిమారంగంలో ఆ క్రమశిక్షణ, సిన్సియారిటీల వల్లే ఇన్ని సంవత్సరాలుగా ఈ రంగంలో ఉండగలిగారు.

అక్కినేని సంజీవ్ (ఎల్.వి.ప్రసాద్ తమ్ముడు), మందపాటి రామచంద్రయ్యలు ఎడిటింగ్‌లో అనిల్‌కు గురువర్యులని చాలా సందర్భాలలో చెప్పారు. సినిమాలో మొత్తం 24 ఫ్రేమ్స్ ఉంటాయి. అందులో ఎడిటింగ్ కూడా ఒకటి. ఎడిటింగ్ చేయడంలో తేడా వస్తే మాత్రం కథను అర్థం చేసుకోవడం కష్టం. సాధారణంగా ఎడిటింగ్ చేసేటప్పుడు మాతో పాటు డైరెక్టర్, కో డైరెక్టర్ ఉంటారు. వాళ్లు దగ్గర ఉంటేనే పని సులువవుతుందంటారు అనిల్. తెర వెనుక పని చేసేవాళ్లు ఎలా ఉంటారో సామాన్య ప్రజలకు తెలియదు. కానీ నటీనటులను వెండి తెర మీద చూస్తారు కనుక వారిని వెంటనే గుర్తించగలుగుతారు. వాళ్లకు వచ్చే ప్రశంసలన్నీ మాకు వచ్చినట్లే కదా అంటారు అనిల్.

**సమయపాలన:** బాపుగారి పది సినిమాలకు పని చేసిన తర్వాత, వంశీ, ఏడిద నాగేశ్వరరావుగారి ద్వారా అనిల్‌ని పిలిపించారట. ఆ తరవాత గీతాకృష్ణ కూడా అనిల్‌తో చేయించుకున్నారు. సీనియర్ దర్శకుడు బాపు వద్ద షూటింగ్ సమయంలో ఎప్పుడూ సమయపాలన పాటించేవారు అనిల్. అందుకే ఆ కాంబినేషన్ అలా వర్కవుట్ అయింది. అంతేకాదు అనిల్‌మల్నాడ్ ప్రయాణం తెలుగు సినిమాలతో మొదలైంది, తెలుగు సినిమా తనకు తల్లి లాంటిదంటారు. అనిల్‌కు అవార్డులు తెచ్చిందీ తెలుగు సినిమానే. బాపుగారికి అనిల్ పెద్ద కొడుకుతో సమానం అంటారెప్పుడూ... బాపుతో మొత్తం 22 సినిమాలకు పని చేశారు అనిల్. ఇండస్ట్రీలో ఇంత ఎదగడానికి కారణం బాపురమణలే. తనకు వాళ్లు సినిమా మనుషుల్లాగ అనిపించరంటారు. అంత సింపుల్‌గా ఉంటారు వాళ్లు. మొదటినుంచి అనిల్ బయట పబ్లిసిటీకి రాకపోవడానికి కారణం కూడా అదే అయివుండవచ్చు. వారి నుంచే ఆ లక్షణం అనిల్‌కు వచ్చిందని ఇండస్ట్రీ గుసగుసలాడుతుంటారు.











**జాతీయ స్థాయి అవార్డు:** బాపుగారి దగ్గర అనిల్ అసిస్టెంట్‌గా మొదలుపెట్టిన నాటి నుంచి ఆయన తనను దగ్గరగా చూశారు. పని పట్ల అనిల్‌కున్న నిబద్ధతను గమనించిన ఆయన, వంశవృక్షం చిత్రానికి ఎడిటింగ్ బాధ్యతలు చేపట్టమని స్వయంగా ఆదేశించారట. ఆయన మాట కాదనలేక అంగీకరించారు అనిల్. అనిల్ మల్నాడ్‌తో ఎడిటింగ్ అంటే 10 నిమిషాలుముందే ఉండాలి అని స్వయంగా ఆయనతోనే అనిపించుకున్నారు. ఆయన నుంచి నేర్చుకున్న క్రమశిక్షణ వల్లే తాను ఈ స్థాయికి వచ్చానంటారు అనిల్.

బ్లాక్ అండ్ వైట్‌కి, రంగుల సినిమాకి ఎడిటింగ్‌లో ఏమైనా తేడా ఉంటుందా? అని అనిల్‌ని అడిగితే...ప్రస్తుతం కంప్యూటర్ విధానం రావడం వల్ల పని తేలికైపోయింది. ఆరుగురు చేసే పనిని ఒక్కరు చేసేస్తున్నాం. ఎడిటింగ్ విషయంలో రంగులు, నలుపు తెలుపు తేడా లేదంటారు. మొట్టమొదటి జాతీయ అవార్డు వంశీ తీసిన సితార చిత్రానికి 1984లో నాటి రాష్ట్రపతి జైల్‌సింగ్ చేతుల మీదుగా అందుకున్నారు. అప్పుడు అనిల్ వయసు 25 సంవత్సరాలు. అసలు అవార్డు గురించి తెలుసుకునేంత జ్ఞానం కూడా అప్పుడు తనకు లేదంటారు. దక్షిణాది వారికి జాతీయ అవార్డు రావడం చాలా విశేషం.









## వాత్సాయన

# పడకగదిలో మగవారు అసహ్యించుకునే విషయాలు..!!



**మంచంమీద వురుషులు అసహ్యించుకునే విషయాలు అనేకం ఉన్నాయి. ఇది ఆడవారికి కూడా వర్తిస్తుంది. మంచం మీద వురుషులు చేసే కొన్ని విషయాలు ఆడవారు కూడా ఇష్టపడనివి కొన్ని ఉన్నాయి.**

మంచంమీద వురుషులు అసహ్యించుకునే విషయాలు అనేకం ఉన్నాయి. ఇది ఆడవారికి కూడా వర్తిస్తుంది. మంచం మీద వురుషులు చేసే కొన్ని విషయాలు ఆడవారు కూడా ఇష్టపడనివి కొన్ని ఉన్నాయి.

కానీ ఈ ఆర్టికిల్ వురుషులు మంచం మీద ద్వేషించే కొన్ని విషయాలపై దృష్టి సారించాయి. ప్రేమను పొందడం ద్వారా ఇద్దరు వ్యక్తులు ఆనందాన్ని, సంతోషాన్ని పంచుకోవడం అనేది ఒక అందమైన మార్గం. ఇద్దరూ నిస్వార్ధంగా కష్టాలను పంచుకోవడంలో ఉమ్మడి ప్రణాళిక చాలా ఉత్తమం. నిజానికి, కనీసం శారీరక సంబంధాలు మితిమీరెంత వరకు, తిరిగి ప్రేమికులుగా ఉండేంతవరకు శృంగార సంబంధాలు ఏర్పడతాయి లేదా శృంగార సంబం ధాలు విచ్ఛిన్నం అవు తాయి. చదవండి.....

మంచం మీద పాసివ్‌గా ఉంటే వురుషులకు విసు గుగా అనిపిస్తుంది. వురు షుడు అన్ని పనులను చేయడానికి చొరవ తీసు కుని ఉంటే, ఆ ఉత్సాహం ఉండదు.

నియమాలు చెప్పడం అనేది వురుషులు ద్వే షించే మరో విషయం. మీరు ఇలా చెయ్యి, అలా చేయొద్దు' అని చెవ్తుంటే అతనికి కోపం వస్తుంది. అయితే, మీకు కొన్ని ప్రాధాన్యతలు ఉండొచ్చు. భోజనం చేసేటవుడు ఆ విష యాలను పడకగది బైట వారికి వివరించండి. ఆ పని చేసేటవుడు మధ్యలో అతనిని నియంత్రిం చాలి అనుకుంటే, అతను ఆపేయడం చేయవచ్చు.

మంచం మీద ఆపకుండా మాట్లాడడం అనేది కూడా అతనిని పక్కకు వెళ్లేట్టు చేస్తుంది. అతను ఆపని చేయడంలో బిజీగా ఉన్నవుడు, అతని మనసు కేవలం ఆ ఆర్గాన్ గురించే ఆలోచిస్తుంది. అదే అతను మీ నుండి కూడా కోరుకుంటాడు. కానీ మీరు నగ్నంగా ఉన్నత ర్వాత కూడా మీ సంభాషణ జరుగుతూ ఉంటే అతను మిమ్మల్ని ద్వేషించవచ్చు.

> మీరు మూడ్‌లో లేనవుడు మీకు మీరే వత్తిడి చేసినా అతను ఆగిపోతాడు. మీకు ఇష్టం లేకపోతే వద్దు అని చెప్పడం సరైనదే. కానీ మీరు సగం మనసుతో అతను కోరిక తీర్చాలి అనుకుంటే, దాన్ని అతను ఇష్టపడడు. త్వరగా పూర్తి కాని అనేమాట కూడా అతనిని భంగం కలిగిస్తుంది. అయితే, కొన్నిసార్లు, త్వరపడడం కూడా మంచి విషయమే. కానీ పడకగదికి వెళ్ళే ముందే అతనికి చెప్పండి.



మీరు మూడ్‌లో లేనవుడు మీకు మీరే వత్తిడి చేసినా అతను ఆగిపోతాడు. మీకు ఇష్టం లేకపోతే వద్దు అని చెప్పడం సరైనదే. కానీ మీరు సగం మనసుతో అతను కోరిక తీర్చాలి అనుకుంటే, దాన్ని అతను ఇష్టపడడు.

త్వరగా పూర్తి కాని అనేమాట కూడా అతనిని భంగం కలిగిస్తుంది. అయితే, కొన్నిసార్లు, త్వరపడడం కూడా మంచి విషయమే. కానీ పడకగదికి వెళ్ళే ముందే అతనికి చెప్పండి. త్వరపడడానికి అతని మనసు సిద్ధమై ఉంటుంది.

మీ శరీరం గురించి ఎక్కువ శ్రద్ధ చూపించడం అనేది కూడా అతనిని పక్కకు నెడుతుంది. ఇద్దరూ మూడ్ లో ఉన్నవుడు, చాలా విషయాలు జరుగుతాయి అదేమీ పెద్ద విషయం కాదు. అందువల్ల, మీరు నగ్నంగా ఉన్నవుడు మీరు బరువు పెరిగారని, ఏదైనా కారణం చేత లేదా మీ భుజం మీద యాక్నే ఉండడం వల్ల ఎక్కువ శ్రద్ధతో బాధపడినవుడు అనొద్దని చెప్పండి.

## లక్కీ నంబర్

# అనుకున్న పనుల్లో ఆటంకం

నా పేరు ఎమ్. మహేష్. డేట్ ఆఫ్ బర్త్ 8-5-1988. చదువులో ఏకాగ్రతలేదు. చదువుసాగడంలేదు. ఏదీ కూడా కలిసిరావడంలేదు. నాకు సరైన మార్గం చూపించండి.

**మహేష్, హైదరాబాద్**

మహేష్ అనే పేరులో 6, 3 అనే సంఖ్యాలు ఉన్నాయి. అందువలన జీవితం ఆరు మూడు అవుతున్నది. అంటే రెండూ కూడా విధ్వంసం నంబర్లే. మీ పేరులో మహేష్‌కు ముందు ఎమ్ అనే ఇనీషియల్‌ను చేరిస్తే 31వ నంబర్ వస్తుంది. దీనిని డెత్ నంబర్ అని అంటారు. అందుకని మీరు మీ పేరును ఇక నుండి **MAAHESH** గా మార్చు కుని వాడుకోండి. ఈ పేరులో అత్యంత ప్రభావం గల 24 నంబర్ చేర్చడం జరిగింది. దీనికి జతగా ఇంటిపేరులోని ఇనీషియల్ ఎమ్ కూడా పేరుకుముందు వాడుకోవచ్చు. దాని వలన 28వ నంబర్ వస్తుంది. 6,7 మీ అదృష్ట సంఖ్యలు. ఇలా మార్చుకుంటే మీరు కోరుకున్న విజయాలు మీ తలుపు తడతాయి. ఉన్నత విద్యావంతులు కాగలరు.

★★★

నా పేరు మోకిలి రాజు. పుట్టిన తేదీ 8-1-1975. నేను ఎంతగా కష్టపడినా సరైన ఫలితం ఉండటంలేదు. నా మానసిక ఆరోగ్యం సరిగాలేదు. అన్నీ సమస్యలే. నాకు దయచేసి ఏదైనా మార్గం చూపించగలరు.

**మోకిలి రాజు హుజూరాబాద్**

మోకిలి రాజు అనే పేరులో బ్లాస్టింగ్ నంబర్ ఉంది. అది వ్యతిరేక ప్రభావం చూపే సంఖ్య. సంఖ్యాశాస్త్రం ప్రకారం దాని ఫలితం చాలా తీవ్రంగా ఉంటుంది. మీరు మీ పేరును **MOKILLE RAZU** గా 41 రోజులు 41 సార్లు 5 కోర్సులుగా రాసుకోండి. 2,5 మీ అదృష్ట సంఖ్యలు. ఇక నుండి మీరు ఎక్కడ రాసినా ఇలానే రాసుకోండి. మీ జీవితం అంతా అదృష్టదాయకంగా సాగుతుంది. మీ మానసిక అనారోగ్యం కూడా కుదటపడుతుంది. ఆర్ధికంగా నిలదొక్కుకుంటారు.

★★★

నా పుట్టిన తేదీ 4-3-1975. నా పేరు సతీష్. చేస్తున్న ఉద్యోగంలో ఎదుగుదల లేదు. అన్నీ కూడా రివర్స్‌గా జరుగుతున్నాయి. అనుకున్నది ఒకటి అయింది మరొకటి అన్నట్టుగా ఉంది. ఏ పనీ కూడా సవ్యంగా సాగడంలేదు. అన్నీ సమస్యల మయం. సరైన మార్గం చూపించండి.

**సతీష్, నిజామాబాద్**

సతీష్ అనే మీ పేరులో రివర్స్ నంబర్ 12 ఉంది. అందు వలనే మీకు అలా జరుగుతోంది. ఇక నుండి మీ పేరును **SATTISH** అని 21 సార్లు 10 కోర్సులుగా రాసుకోండి. 3,7 మీ లక్కీనంబర్లు. ఇలాచేస్తే మీ జీవితం అంతా సుఖ మయంగా సాగుతుంది. మీరు అనుకున్న పనులు...మీ ధ్యేయం నెరవేరుతాయి. కష్టాలన్నీ కడతేరుతాయి. జీవితంలో రెండవ అధ్యాయాన్ని చవిచూస్తారు.

★★★

నేను మహబూబ్‌నగర్‌లో స్టేట్ గవర్నమెంట్ ఉద్యోగిగా చేస్తున్నాను. నా పేరు సి సాంబమూర్తి. డేట్ ఆఫ్ బర్త్ 6-4-1953. చిన్నప్పటి నుండి నాకు ఆర్థిక ఇబ్బందులే. సంతానం కూడా లేదు. చేస్తున్న ఉద్యోగంలో ప్రమోషన్ లాంటివి కూడా లేవు. వెంటవెంటనే రకరకాల జబ్బులు వచ్చి కోలుకోలేనివిధంగా జీవితం తయారయింది. క్రమంగా జ్ఞాపకశక్తి తగ్గిపోతోంది. ఆఫీసులో కూడా ఇతర ఉద్యోగస్తులతో ఇమడలేకపోతున్నాను. దగ్గరి బంధువులు మూర్తి అని...ఆఫీసులో సాంబమూర్తి అని పిలుస్తుంటారు.

**సి. సాంబమూర్తి, మహబూబ్‌నగర్**

మూర్తి అనే పేరులో 'ఆత్మబలిదానం' అనే 33వ నంబర్ ఉన్నది. మననుండి లాభం పొంది మనకు నష్టం కలిగించే నంబర్ అది. దీని ప్రభావం వలన మీ వద్ద డబ్బులు తీసు కున్నవాళ్లు తిరిగి మీకు ఇచ్చే పరిస్థితి ఉండదు. పైగా మీకు ఇతరులు డబ్బు ఇస్తే...విపరీతమైన ఒత్తిడిచేసి తీసు కుంటుంటారు. మీ మొత్తం సి. సాంబశివరావు అనే పేరులో "బ్రాడింగ్ ఓవర్ ది లాసెస్" అనే ప్రభావం చూపే 45వ నంబర్ ఉంది. దాని చెడు ప్రభావం వలనే మీకు అన్నీ అలా జరుగుతున్నాయి. మీ సంతకంలో కూడా ఒవెల్స్1 కాన్సొనెంట్స్ 6 ఉన్నాయి. వీటిని విధ్వంసకరమైన జంట అని అంటారు. ఆ జంట నంబర్ల వలనే మీరు అనారోగ్యంపాలవుతున్నారు. మీకు లాస్ ఆఫ్ మెమొరీ కూడా దాని ప్రభావం వలనే. అందుకనే మీరు ఇక నుండి **SAMBBAMURRTHI** గా మీ పేరును రాసుకోండి. దానికి 37 అనే ప్రభావవంతమైన నంబర్‌ను జతచేయడం జరిగింది. 4,1,5 మీ లక్కీనెంబర్లు. 37ను హై పొటెన్షియన్సీ నెంబర్ అంటారు. దీనివలన ఇంతకుముందు మీకు జరిగిన బ్యాడ్‌నెస్ అంతా కూడా తొలగిపోతుంది. మీరు సంపూర్ణ ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడుపుతారు. అదృష్టవంతంగా సాగిపోతుంది.

★★★

నా పేరు చలపతిరావు. 2-3-1966 లో పుట్టాను. నాకు చేతనైతంతలో సాయం చేస్తూనే ఉంటాను. నాకు అంతా కూడా పనిగట్టుకుని అన్యాయం చేస్తున్నారు. తెలిసి నేను ఎవరికీ హాని చేయలేదు.చేసే ఉద్యోగంలో డెవలప్‌మెంట్స్ ఏమీ లేవు. నాతోటి వారంతా ఇలా వచ్చి అలా ఎదుగుతున్నారు. నేను మాత్రం చేరినప్పుడు ఏ స్థాయిలో ఉన్నానో ఇప్పుడు కూడా అదే స్థాయిలో కొనసాగుతున్నాను. ఇంట్లో కూడా అన్నీ సమస్యలే. తగిన సూచనలివ్వగలరు.

**చలపతిరావు,నల్గొండ**

చలపతి అనే పేరులో సంఖ్యాశాస్త్రం ప్రకారం చెడు ప్రభావం చూపించే నంబర్ 31 ఉంది. దీనిని డెత్ నెంబర్ అంటారు. ఆ నంబర్ ప్రభావం వలనే మీ జీవితం ఇలా ఒడిదుడుకులలో సాగుతోంది. అయితే మీరు ఇఇఏఅ ఔఅ్కఅఖీఫ్గా మీ పేరును మార్పుచేసుకుంటే దాని మొత్తం సంఖ్య 35 వస్తుంది. దాని ప్రభావం వలన ఇకముందు మీ జీవితంలో ముందుకు దూసుకెళతారు. ఇంట్లో సమస్యలు అన్నీ పరిష్కారం అయి ఆనం దంగా జీవిస్తారు. 2,8 మీ అదృష్ట సంఖ్యలు. మీరు చేసే సహాయ కార్యక్రమాలే మిమ్మల్ని నిలబెడతాయి. ఎన్ని కష్టాలొచ్చినా మీరు అనుకున్నది మా త్రం చేయండి.



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# మనసున్న మారాణులు

సమంత, శ్రుతిహాసన్ ఇద్దరూ ఇద్దరే... అటు గ్లామర్ పరంగా.. ఇటు యాక్టింగ్ పరంగా ఒకరితో ఒకరు పోటీ పడుతూ ముందుకు సాగుతున్నారు. ప్రస్తుతం ఈ ఇద్దరూ దక్షిణాదిన పెద్ద పెద్ద సినిమాలు చేస్తూ నంబర్ రేసులో ముందున్నారు. అయితే మిగిలిన కథానాయికల్లా సినిమా చేశామా.. పారితోషికం తీసుకున్నామా.. పోయామా అన్నట్లు కాకుండా సమాజానికి ఎంతో కొంత సాయం చేయాలని తపన పడుతుంటారు... సమంత ప్రత్యూష ఫౌండేషన్ స్థాపించి... అనాథలకు అండగా ఉంటుండగా.. శ్రుతిహాసన్ కూడా చెన్నైలో అప్పుడప్పుడూ మంచి కార్యక్రమాలు చేస్తూ అందరి మనసులను గెలుచుకుంటోంది. ఇప్పటికే పలు సందర్భాల్లో మంచి మనసున్న మహారాణులుగా మెప్పుపొందిన ఈ ఇద్దరు భామలు.. ముందు ముందు మరిన్ని మంచి పనులు చేయాలని భావిస్తున్నారు.

హీరోయిన్ సమంత అతి తక్కువ కాలంలోనే సౌత్‌లో స్టార్ హీరోయిన్ గా ఎదిగింది. రెమ్యూనరేషన్ కూడా భారీగానే తీసుకుంటుంది. అయితే తాను సంపాదించిన డబ్బులో కొంత మొత్తానికి సేవా కార్యక్రమాలకు ఉపయోగిస్తోంది. ప్రత్యూష ఫౌండేషన్ స్థాపించిన సమంత ఈ ఆర్గనైజేషన్ ద్వారా డబ్బులేని కారణంగా ఆపరేషన్ చేయించుకోలేకపోతున్న పేద చిన్నారులకు సాయం చేస్తోంది. తాజాగా అవయవ దానం కార్యక్రమంలో తాను భాగస్వామి అవ్వాలని నిర్ణయించుకుంది. తాను అవయవ దానం చేయడానికి ముందుకు రావడంతో పాటు తన అభిమానులను కూడా ఆదిశగా ప్రోత్సహించే ప్రయత్నం చేస్తోంది. నవంబర్ 7వ తేదీన ప్రత్యూష ఫౌండేషన్ తో పాటు, హైదరాబాద్ లోని ఓ ప్రైవేట్ హాస్పిటల్ ఆధ్వర్యంలో ఏర్పాటు చేయనున్న కార్యక్రమంలో అవయవదానం విషయంలో ప్రతిజ్ఞ చేయబోతోంది. ఈ విషయంలో ప్రజల్లో అవగాహన కల్పించబోతోంది. అవయవ దానం ఉద్యమంగా సాగేలా తన వంతు ప్రయత్నం చేస్తానంటోంది సమంత.

**మనిషికి రెండో జీవితం:**

అవయవదానం మనిషికి రెండో జీవితం. ఒక వ్యక్తి అవయవదానం ద్వారా ఎంతో మందికి పునర్జన్మ ఇవ్వొచ్చు. ఇవి కేవలం అందమైన నినాదాలు మాత్రమే కాదు. వాస్తవాలు. అంతకన్నా నేటి ఆధునిక యుగంలో జీవన సత్యాలు. ఈ మధ్య అవయవదానం గురించి విస్తృతంగా ప్రచారం జరుగుతున్నది. అంతకన్నా ఎక్కువగా దాని ప్రాముఖ్యాన్ని గురించి చర్చ జరుగుతున్నది. ఆధునిక శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధి, దానిలో భాగంగా పెరిగిన వైద్యశాస్త్ర పరిజ్ఞానం వెలుగులో ఎన్నో అసాధ్యమనుకున్న వాటిని సుసాధ్యం చేసి మనిషికి ప్రాణం నిలువుతున్నారు, లేదా పోస్తున్నారు. ఈ నేపథ్యంలో అవయవదానం గురించి, దాని ప్రాధాన్యం గురించి సమా జంలో విస్తృతంగా ప్రచారం చేయాల్సిన అవసరమున్నది.

**ఆధ్యాత్మికం దిశగా:**





ఇటు టాలీవుడ్.. అటు కోలీవుడ్‌లో మంచి బిజీగా ఉన్న సమంత ఉన్నట్టుండి ఆధ్యాత్మిక మార్గంలోకి వెళ్లిపోయింది. అదికూడా అలా ఇలా కాదు.. ఏకంగా మహాభారతాన్ని ఔపోసన పట్టేసినట్టు కబుర్లు చెప్పడం మొదలుపెట్టింది. తన అఫీషియల్ ట్విట్టర్ అకౌంటులో తాజాగా వెరైటీ కామెంట్ పోస్ట్ చేసింది. అన్నిరకాల సంపదను కలిగి ఉండేవారెవరో తెలుసా....ఎవరైతే బాధ-సంతోషం, అదృష్టం-దురదృష్టం, గతం-భవిష్యత్తులను సమానంగా చూడగలరో వారొక్కరే... అనే అర్థం వచ్చేలా మహాభారతం సూచించే ఓ సందేశాత్మక కోట్‌ను ట్వీట్ చేసింది. ఎప్పుడు.. ఎక్కడ.. ఎలా.. అనేది తెలిసిపోయింది. ఇక 'ఎందుకు?' అనేది మాత్రం తెలియాల్సి ఉంది. అటు కోలీవుడ్, ఇటు టాలీవుడ్‌లలో స్టార్ హీరోలతో సినిమాలు చేస్తూ ఫుల్ బిజీగా ఉన్న సమంతకు సడన్‌గా 'మహాభారతం' ఎందుకు గుర్తొచ్చినట్లు చెప్మా అనుకుంటున్నారంతా...

**శృతిహాసన్:**

శృతిహాసన్ రెమ్యునరేషన్ తిరిగి ఇచ్చేసిందట. శృతిహాసన్ ఆ మధ్య పులి అనే డిజాస్టర్ సినిమాలో నటించింది. 120 కోట్లతో తెరకెక్కిన ఈ చిత్రం నిర్మాతకు.. డిస్ట్రిబ్యూటర్స్‌కు భారీ నష్టాలు మిగిల్చింది. అయినా.. బాకీపడిన రెమ్యునరేషన్ తిరిగి ఇచ్చేయాలంటూ.. సీనియర్ హీరోయిన్ శ్రీదేవి నిర్మాతల మండలిని ఆశ్రయించింది. అయితే.. శృతిహాసన్ మాత్రం పాపం నిర్మాత అంటూ.. జాలి చూపించింది.

పులి భారీ నష్టాలు మిగిల్చినా.. నటీనటులకు ఇవ్వాల్సిన రెమ్యునరేషన్‌ను ఇచ్చుకుంటూ వస్తున్నాడు నిర్మాత. ఈ క్రమంలో శృతిహాసన్‌కు 20 లక్షల చెక్ ఇవ్వగా.. దాన్ని తిరిగి ఇచ్చేసింది. పులి సినిమాలో నటించడం వల్ల శృతిహాసన్‌కు ఒరిగింది ఏమీ లేదు. అరకొర కాస్ట్యూమ్స్.. ఓవర్‌మేకప్‌తో వున్న క్రేజ్ కాస్తా పోయింది. ఇవేవీ పట్టించుకోని శృతి... సినిమా రిలీజ్ తర్వాత రెమ్యునరేషన్ కింద నిర్మాత ఇచ్చిన డబ్బును తిరిగిచ్చేసింది.

**మాతృభాషలో తొలి హిట్:**

టాప్ వారసురాలిగా ఎంట్రీ ఇచ్చినా.. సక్సెస్ కోసం చాలా రోజులు పాటు వెయిట్ చేసిన అందాల భామ శృతిహాసన్. తెలుగు, తమిళ, హిందీ.. ఇలా అన్ని భాషల్లోనూ అదృష్టాన్ని పరీక్షించుకున్న ఈ భామ ఎక్కడా సక్సెస్ సాధించలేకపోయింది. చాలా కాలం తరువాత తెలుగులో తెరకెక్కిన 'గబ్బర్‌సింగ్' సినిమాతో తొలి హిట్ అందుకున్న శృతి ఆ తరువాత వెనుదిరిగి చూసుకోలేదు. తెలుగులో వరుస సూపర్‌హిట్స్‌తో దూసుకుపోతున్న శృతిహాసన్, బాలీవుడ్‌లో కూడా అదే జోరు చూపిస్తోంది. అయితే తన మాతృభాష అయిన తమిళ నాట మాత్రం పెద్దగా ఆకట్టుకోలేకపోయింది. ఎన్ని భాషల్లో విజయాలు సాధించినా కోలీవుడ్‌లో సక్సెస్ కాలేకపోవటంతో శృతికి కష్టంగా అనిపించింది. అయితే ఈ బాధను 'వేదలం' సినిమాతో తీర్చేసుకుంది ఈ బ్యూటీ. అజిత్ హీరోగా, శివ దర్శకత్వంలో తెరకెక్కిన 'వేదలం' సినిమాతో మంచి సక్సెస్‌ను అందుకుంది. ఈ సినిమాకు డివైడ్ టాక్ వచ్చినా కలెక్షన్ల పరంగా మాత్రం సూపర్ హిట్ జోరు చూపిస్తోంది. ఏ సెంటర్స్‌లో పెద్దగా వర్క్అవుట్ కాకపోయినా.. బి, సి సెంటర్స్‌లో అజిత్ జోరు కనిపిస్తోంది. ఈ సక్సెస్‌తో తెలుగు, తమిళ, హిందీ భాషల్లో సక్సెస్ సాధించిన హీరోయిన్‌గా ప్రూవ్ చేసుకుంది శృతిహాసన్.



కిరీటం అలంకరించుకొన్న శిరస్సు సుఖాలకు దూరం కావలసి వస్తుంది. కూడా -షేక్స్‌పియర్

# కొరియా ద్వీప కల్పంలో యుద్ధ మేఘాలు

కొరియా ద్వీపకల్పంలో మరోసారి యుద్ధ మేఘాలు కమ్ముకున్నాయి. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా, రష్యాల ప్రచ్ఛన్న యుద్ధం ఫలితంగా కొరియా ద్వీపకల్పం రెండు ముక్కలైంది. ఉత్తర కొరియా, దక్షిణ కొరియాలుగా విడిపోయింది. ఉత్తర కొరియాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడగా, ద.కొరియాలో పెట్టుబడిదారి ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. తర్వాత చైనా సాయంతో ఉ.కొరియా సైనిక సంపత్తి పెంచుకుంది. తూర్పు ఆసియాను ఉద్రిక్త ప్రాంతంగా మార్చింది. ఇటీవల కాలంలో ఆ దేశంలో పలు రకాల క్షిపణులను పరీక్షించింది. అగ్ర రాజ్యాల మాటను లెక్కచేయకుండా, ఖండాంతర క్షిపణులను కూడా పరీక్షించింది. తాజాగా అణ్వాయుధ పరీక్ష చేపడతామంటూ ప్రపంచ దేశాలను భయపెడుతోంది. దీంతో ద.కొరియాకు సాయం అమెరికా రంగంలోకి దిగింది.

దక్షిణ కొరియాకు మద్దతుగా యుద్ధ నౌకల మోహరింపు మీకు చేతనైతే కట్టడి చేయండి, లేదంటే మేం రంగంలోకి దిగుతాం అని హెచ్చరించిన అమెరికా అధ్యక్షుడు ట్రంప్ అన్నంత పనీ



చేస్తున్నారు. చీటికి మాటికి కాలుదువ్వుతున్న ఉత్తర కొరియాను అదుపులో పెట్టటానికి నడుం కట్టారు.

1950-53 కొరియా యుద్ధం తర్వాత ఉత్తర కొరియా విషయంలో అమెరికా ఇంత దూకుడుగా వ్యవహరించటం ఇదే తొలిసారి.

రసాయన ఆయుధాలు వినియోగించినట్లు ఆరోపణపై ఇటీవల సిరియా మీద 59 తోమహక్ మిస్సైళ్లను అమెరికా ప్రయోగించింది. మరోపక్క అఫ్ఘనిస్థాన్‌లో అతిపెద్ద నాన్- నూక్లియర్ బాంబు వేసింది. ఇష్టానుసారం అణుపరీక్షలు నిర్వహిస్తున్న ఉత్తర కొరియాపై ఇదే మాదిరిగా విరుచుకు పడవచ్చని అంతర్జాతీయ వ్యవహారాల నిపుణులు విశ్లేషిస్తు న్నారు. అదే జరిగితే ఆగ్నేయ ఆసియా ఒక్కసారిగా రావణ కాష్టం అవుతుంది. అటు చైనా, ఇటు దక్షిణ కొరియా ఈ పరిణాలపై తీవ్ర ఆందోళన చెందుతున్నాయి.

అవసరం అయితే అమెరికాపై అణు దాడి చేయటానికి కూడా వెనకాడమని ఇటీవల ఉత్తర కొరియా సవాలు చేసింది. ఇది అమెరికా అధికార యంత్రాంగంలో ప్రకంప నలు సృష్టించింది. ఉత్తర కొరియాకు పొరుగున ఉన్న చైనా అన్ని రకాలుగా అండదండలు అందిస్తోందనేది తెలిసిన



విషయమే. అందుకే ఆ దేశాన్ని కట్టడి చేయాల్సిన బాధ్యత చెనాపై ఉందని అమెరికా భావిస్తోంది. చైనా ఒత్తిడికి తోడు దౌత్యపరమైన చర్యలు, ఆంక్షల ద్వారా ఆ దేశం దారిలోకి వస్తుందని ఆశిస్తోంది. కానీ ఉత్తర కొరియా అందుకు సిద్ధంగా ఉన్నట్లు కనిపించటం లేదు. పైగా మరోసారి అణుపరీక్షలు నిర్వహించేందుకు సన్నాహాలు చేస్తోంది. అదే జరిగితే దీటుగా స్పందించాలని అమెరికా భావిస్తోంది.

కొరియా ద్వీపకల్పం నుంచి ఆస్ట్రేలియా బయలుదేరిన అమెరికా యుద్ధ విమాన వాహకనౌక యూఎస్ఎస్ కార్ల్ విన్సన్ వెనుదిరిగి మళ్లీ దక్షిణ కొరియాకు రక్షణగా వచ్చింది. అదేవిధంగా దక్షిణ కొరియాలోని తన సైనిక బలగాన్ని బలోపేతం చేసే పనిలో పడింది. అమెరికా రక్షణశాఖ వర్గాలు అమెరికా అధ్యక్షుడికి ఇప్పటికే ఉత్తర కొరియా విషయంలో ఏం చేయవచ్చనే అంశంలో కొన్ని ప్రతిపాదనలు చేశారు. అణ్వాయుధాలను దక్షిణ కొరి యాలో మోహరించటం ఇందులో ముఖ్యమైన అంశం. దీన్నిబట్టి ఉత్తర కొరియా విషయంలో ఇంతకాలం అమె రికా అనుసరిస్తున్న వైఖరి పూర్తిగా మారినట్లు స్పష్టమవు తోంది.

అమెరికా నుంచి ప్రతిఘటన ఎదురైన పక్షంలో ఉత్తర కొరియా ఏం చేస్తుంది? తిరిగి అమెరికా మీద దాడులు చేస్తుందా? అణ్వాయుధాలు ప్రయోగిస్తుందా? అలా జరగకపోవచ్చు. కానీ పొరుగున ఉన్న దక్షిణ కొరియాను లక్ష్యంగా చేసుకొని పెను దాడికి దిగుతుంది. ఆ దేశం దృష్టిలో దక్షిణ కొరియా మీద దాడి చేయటం అంటే అమెరికా మీద దాడి చేసినట్లే. దక్షిణ కొరియా రాజధాని సియోల్, ఉత్తర- దక్షిణ కొరియా దేశాల సరిహద్దుకు అత్యంత సమీపంలో ఉన్న నగరం కావటం గమనార్హం. దక్షిణ కొరియా జనాభాలో దాదాపు 45 శాతం రాజధాని నగరమైన సియోల్, దాని పరిసరాల్లోనే ఉంటారు. అంటే సియోల్ మీద దాడి చేస్తే దక్షిణ కొరియాను బాగా దెబ్బతీసినట్లు అవుతుంది. అభివృద్ధి చెందిన దేశమైన దక్షిణ కొరియాలో ప్రజల తలసరి ఆదాయం ఎంతో ఎక్కువ. 2013 గణాంకాల ప్రకారం దక్షిణ కొరియా తలసరి ఆదాయం 25,976 డాలర్లు. స్థూల జాతీయోత్పత్తి (జీడీపీ) 1.3 ట్రిలియన్ డాలర్లు. ఈ దేశంలో 90 శాతం మంది ప్రజలకు అంతర్జాలం సదుపాయం అందుబాటులో ఉంది. ఆటోమొబైల్ దిగ్గజమైన హ్యూండాయ్, ఎలక్ట్రానిక్స్ రంగంలో అగ్రగామి సంస్థలైన శ్యామ్‌సంగ్, ఎల్‌జీ దక్షిణ కొరియా కంపెనీలే. ఈ సంస్థల ప్రధాన కార్యాలయాలు సియోల్‌లో ఉన్నాయి. నౌకా నిర్మాణం, గనుల తవ్వకం, నిర్మాణ రంగం, ఇంజనీరింగ్, ఎలక్ట్రానిక్స్, ఆటోమొబైల్ రంగాల్లో దక్షిణ కొరియా విశేష ప్రగతి సాధించింది. ఆ దేశంపై దాడి జరిగితే అది ఆగ్నేయ దేశాలన్నింటిపైనా ప్రభావం చూవుతుంది.

## ఉత్తర కొరియా సైనిక సత్తా

- మిలటరీ బలగం : 12 లక్షల మంది
- రిజర్వు బలగాలు : 6 లక్షలు
- యుద్ధ ట్యాంకులు : 4,100
- ఫిరంగులు : 8,500
- క్షిపణులు : 1,000 వరకూ (1300 కిలోమీటర్ల నుంచి 5000 కిలోమీటర్ల వరకూ లక్ష్యాలను ఛేదించగలవు)
- రాకెట్ లాంఛర్లు : 5,100
- ఎయిర్ డిఫెన్స్ గన్స్ : 11,000
- యుద్ధ నౌకలు : 500
- యుద్ధ విమానాలు : 940
- రక్షణ బడ్జెట్: 10 బిలియన్ డాలర్లు (దాదావు రూ. 65,000 కోట్లు). ఉత్తర కొరియా జీడీపీ 25 బిలియన్ డాలర్లు (2015 గణాంకాల ప్రకారం). తలసరి ఆదాయం 1,000 డాలర్లు.
- అణ్వాయుధాలు: 2006 అక్టోబరు 9న తొలిసారిగా అణు పరీక్ష నిర్వహించినట్లు ఉత్తర కొరియా ప్రకటిం చింది. 2006 నుంచి 2016 సెప్టెంబరు మధ్యకాలంలో అయిదుసార్లు అణుపరీక్షలు నిర్వహించింది. ఇప్పుడు ఆరోదఫా అణు పరీక్షకు సిద్ధమవుతోంది. ఇదే అమెరికా కోపానికి కారణమవుతోంది.
- అణు వార్‌హెడ్లు: ఉత్తర కొరియా చేతిలో 15 నుంచి 20 వరకూ అణు వార్‌హెడ్లు ఉంటాయని అంచనా.

దక్షిణ కొరియాకు మద్దతుగా అమెరికా నుంచి భీకరమైన సైనిక ప్రతిఘటన ఎదుర వుతుంది. దీంతో ప్రపంచ చిత్రపటంనుంచి ఉత్తర కొరియా అదృశ్యం అయ్యే పరిస్థితి ఏర్పడినా ఆశ్చర్యం లేదు.
ఇబ్బందికరమైన స్థితిలో చైనా

ఉత్తర కొరియాను పెంచి పోషించింది చైనా. అందుకే ఉత్తర కొరియాను అదుపులో పెట్టాల్సిన బాధ్యత చైనాదే అని అమెరికా అంటోంది. కాదంటే తానే రంగంలోకి దిగుతాననే సరికి చైనా ఇబ్బందుల్లో పడినట్లు అయింది. తొందరపాటు తగదని, ఇరుపక్షాలకు ఇప్పుడు చైనా సుద్దులు చెబుతోంది. తాజాగా ఉత్తర కొరియాకు విమాన సర్వీసులను నిలుపుదల చేసింది. ఉత్తర కొరియా విష యంలో ఉద్రిక్తతలు పెరిగితే ఆ దేశం నుంచి శరణార్థులు పెద్ద సంఖ్యలో చైనా తలువు త డ తారం.

అమెరికా సైన్యం చైనా సరిహద్దుల్లోకి వచ్చినట్లు అవుతుంది. దీంతో చైనా సతమతం అవుతోంది.

ఎలాంటి అణుదాడికైనా సమాధానం చెప్పేందుకు ఉత్తర కొరియా సిద్ధంగా ఉందని ఆ దేశ ఉన్నత స్థాయి అధికారి ఒకరు తెలిపారు. అమెరికా ఏ తరహా దాడులు చేసిన తాము సమాధానం చెప్తామన్నారు. అవసరమైతే తమ స్టైల్‌లో అణుదాడులు చేసేందుకు కూడా సిద్ధంగా ఉన్నా మని మిలిటరీ అధికారి చోయ్ ర్యోంగ్‌హాయి చెప్పారు. ఉత్తర కొరియా వ్యవస్థాపకుడు కిమ్ 2-సంగ్ 105వ జయంత్యుత్సవాల సందర్భంగా మాట్లాడుతూ ఈ వ్యాఖ్యలు చేశారు. ప్యొంగ్‌యాంగ్‌లో జరిగిన వేడుకల్లో ఉ.కొ రియా అధ్యక్షుడు కిమ్ జొంగ్ ఉన్ పాల్గొన్నారు. మిలిటరీ పరే డ్‌లో తమ సైనిక బలగాన్ని ప్రద ర్శించగా.. కిమ్ సైన్యాధి కారు లకు అభివాదం చేశారు.

దేశ సైనికులు, యుద్ధట్యాంకు లు, ఇతర ఆయుధ సంప త్తితో భారీ పరేడ్ నిర్వహించారు. కిమ్ 2-సంగ్ జయంతి సందర్భంగా కిమ్ జోంగ్ మరో అణు పరీక్షకు ఆదేశించే అవకాశం ఉందని ప్రపంచ దేశాలు ఆందోళన చెందుతున్న నేపథ్యంలో ఉ.కొరియా భారీ ఆయుధ సం పత్తిని ప్రదర్శించడం గమనార్హం. ఈ పరేడ్‌లో తొలిసారిగా సబ్‌మెరైన్ నుంచి ప్రయోగించే బాలిస్టిక్ క్షిపణులు ప్రద ర్శించినట్లు సమాచారం. ఇటీవల అమెరికా, ఉ.కొరియాల మధ్య ఉద్రిక్తతతల నేపథ్యంలో కిమ్ తన సైనిక బలగాన్ని ప్రదర్శించడానికి ఈరోజును మంచి అవకాశంగా ఉప యోగించు కు న్నారు. ఉ.కొరి యా అణు ప రీక్ష చేపడతుం దేమో నని ఆందోళన నేప థ్యంలో అమె రికా దక్షిణ కొరి యాకు రక్షణగా తన సైనిక బల గాన్ని బలో పేతం చేస్తోంది. కొరియా ద్వీపం నుంచి ఆస్ట్రే లియా బయలు దేరిన అమెరికా యుద్ధనౌక తిరిగి వచ్చింది.




ఉత్తర కొరి యా
రాజధాని: ప్యాంగ్‌యాంగ్
అధికారిక పేరు: డెమోక్రటిక్ పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ కొరియా
అధినేత: కిమ్ జోంగ్-యున్
కరెన్సీ: ఉత్తర కొరియా వోన్
జనాభా: 24.9 మిలియన్లు (2013)
ప్రీమియర్: పాక్ ప్యాంగ్-సో
శాసనసభ : సుప్రీం పీపుల్స్ అసెంబ్లీ
విస్తీర్ణం : 1,20,540 చ.కి.మీ.
జీడీపీ (పీపీపీ) : 40 బిలియన్ డాలర్లు
తలసరి ఆదాయం (పీపీపీ) : 1800 డాలర్లు
సరిహద్దు దేశాలు: చైనా, రష్యా, ద.కొరియా
తీర సముద్రాలు: పసుపు సముద్రం, కొరియా బే, జపాన్ సముద్రం.

వరుస క్షిపణి పరీక్షలతో ఉత్తర కొరియా నియంత కిమ్ జాంగ్ ఉన్ ప్రపంచ దేశాలకు వణుకు పుట్టిస్తున్నారు. ప్రపంచ అగ్ర దేశాలు, ఐక్యరాజ్య సమితి హెచ్చరికలను సైతం లెక్క చేయకుండా తన పని తాను చేసుకు పోతున్నారు. ఇప్పటికే ఐదు అణు పరీక్షలను నిర్వహించిన కిమ్ జాంగ్ ఆరో అణు పరీక్షకు సిద్ధమయ్యారంటూ వస్తున్న వార్తలు సంచలనం రేపుతున్నాయి. తన తాత, ఉత్తర కొరియా మాజీ అధ్యక్షుడు కిమ్ ఇల్ సంగ్ 105వ జయంతి (ఏప్రిల్ 15) సందర్భంగా ఈ అణు ప్రయోగం నిర్వహించవచ్చని నిఘావర్గాలు అంచనా వేస్తున్నాయి. జయంతి సందర్భంగా భారీ మిలిటరీ డ్రిల్ నిర్వహిస్తే పర్వాలేదని, అణు పరీక్ష నిర్వహిస్తే మాత్రం సిరియాపై దాడి చేసినట్లుగానే, ఉత్తర కొరియాపై దాడి చేసే అవకాశం ఉందని అమెరికా విదేశాంగ శాఖ సలహాదారు ఒకరు వెల్లడించారు. ఈ నేపథ్యంలో, ఉత్తర కొరియా అణు పరీక్ష నిర్వహిస్తుందా? ఆ దేశంపై అమెరికా దాడి చేస్తుందా? అనే ప్రశ్నలకు కొన్ని గంటల్లో సమాధానం తెలియనుంది. మరోవైపు అమెరికాకు ఏ మాత్రం భయపడే ప్రసక్తే లేదని కిమ్ జాంగ్ ప్రకటించారు. తాము అన్నిటికీ సిద్ధంగానే ఉన్నామని తెలిపారు. ఎలాంటి పరిణామాలకైనా సిద్ధంగా ఉండాలంటూ సైన్యానికి ఆదేశాలు జారీ చేశారు. దీనికి తోడు ఆయన మరో సంచలన వ్యాఖ్య చేశారు. భవిష్య త్తులో ఉత్తర కొరియా, దక్షిణ కొరియా ఏకమవుతాయని, ఆ దేశానికి కూడా తానే అధ్యక్షుడిని అవుతానని తెలిపారు.





ప్రదర్శన ముగియగానే ప్రేక్షకులు వెళ్ళిపోయినట్టుగా ధనం ఎంతయినా చివరకు నశించిపోయేదే. -తిరుక్కురళ్

అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది. -సెయింట్ ఆగస్టన్

# వింతలు- విడ్డూరాలు

## అతి పెద్ద ఐస్‌క్రీమ్!



అమెరికాలోని సెడాబర్గ్‌లో కెంప్స్ డైరీ వందేళ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా భారీ స్ట్రాబెర్రీ ఐస్‌క్రీమ్‌ను తయారుచేసింది. 733 కప్ ఐస్‌క్రీమ్‌లతో సమానమైన ఇది అతిపెద్ద ఐస్‌క్రీమ్ స్కూప్‌గా గిన్నిస్ రికార్డు!




అతి పెద్ద మసీదు ఢిల్లీలోని జామా మసీదు. ఇది 70 ఎకరాల విస్తీర్ణంలో ఉంది.

Dr.Seshagirirao(Srikakulam)

ప్రపంచంలో...

అతిపెద్ద హోటల్ మాస్కోలోని 'ఇజ్మాయిలోవో వేగా హోటల్'. ఇది నాలుగు భవనాల్లో, ఒక్కో భవనంలో 30 అంతస్తుల్లో ఉంది. సుమారు 7,500 గదులు ఉన్నాయి.



ప్రపంచంలో...!

అతి పెద్ద బస్టాండ్ మనదేశంలోని ఢిల్లీలో ఉంది. 60ఎకరాల విస్తీర్ణంలో 1000 బస్సులు పట్టేందుకు వీలుగా దీనిని కట్టారు.



ప్రపంచంలో ఉల్కాపాతం వల్ల ఏర్పడిన అతి పెద్ద గొయ్యి అరిజోనాలోని విన్‌స్లా అనే ప్రాంతంలో ఉంది. ఇది 4,150 అడుగుల విస్తీర్ణం, 150 అడుగుల లోతు ఉంది.



-Dr.Seshagirirao(Srikakulam)




అతి పెద్ద సరస్సు జమ్మూ కాశ్మీర్ బండిపూర్‌లోని వుల్లార్ సరస్సు. ఇది 16 కిలోమీటర్ల పొడవు. 10 కిలోమీటర్ల వెడల్పు ఉంది.

Dr.Seshagirirao(Srikakulam)

## అందనంత అగ్గి పుల్లలు!

Match sticks

ఈ అగ్గి పుల్లలను చూసి నోరు తెరుస్తున్నారా? ఈ భారీ నిర్మాణం ఆస్ట్రేలియాలోని సిడ్నీ నగరంలో ఉంది. బ్రెట్ వైట్‌లే అనే కళాకారుడు 1968 రూపొందించాడు. ఎత్తు 26 అడుగులు. వీటి తయారీలో కలపతో పాటు ఫైబర్ కూడా వాడారు. ఈ భారీ అగ్గి పుల్లలు పర్యాటక ఆకర్షణగా నిలుస్తున్నాయి!



మనదేశంలో...!

కోల్‌కతాలో ఉన్న నేషనల్ లైబ్రరీ దేశంలోనే అతి పెద్ద గ్రంథాలయం. 30 ఎకరాల్లో ఉన్న ఈ గ్రంథాలయంలో సుమారు 22 లక్షల పుస్తకాలు ఉన్నాయి.



Dr.Seshagirirao(Srikakulam)



నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె

## కథ




# నువ్వు + నేను = ప్రేమ

**- నరెద్దుల రాజారెడ్డి**

కళ్లు జిగేలు మనగానే తత్తరపడ్డావా...? ఇంచుమించు అలాంటిదే..కానీ..ఆ మెరుపుకు మబ్బులు కమ్మేయి... ఇది నిజమా? లేక నా భ్రమా? హఠాత్తుగా వెన్నెలమ్మ దిగివస్తే..ఇది ఆశ్చర్యమా? లేక ప్రళయమా? అంతా అయోమయం! అది ఒక సుందరి రూపం... బ్రహ్మ మలచిన సుందరాకార వదన తేజోమయం... పురుషునికి ప్రేరణ కలిగించే రూపం... రంభా ఊర్వశులకు అతీతమైన ఈ ముగ్ధమనోహర రూపాన్ని చూసి... వారికి అసూయ కలిగిందేమో... దివినుండి భువికి నెట్టి వేసారు కాబోలు... పట్టణం నడిబొడ్డున వాలింది ఈ మెరుపుతీగ.

అవి చక్షువులా..? కాదు... ఈ చరాచర సృష్టిలో లేని పుష్పములు... అవి బుగ్గలా..? కానేకాదు... నిగనిగల పసిడి మొగ్గలు..అవి అధరములా...? అరెరే కాదు... తేనే పట్టులు... అవి కురులా...? కాదు నల్లని మబ్బులు... ఆమె నడుము ఒంపులు... తిరుమల కొండ మలుపుల్లా లేవూ...? ఆమె నడకలు చూస్తే..హంస అసూయపడదా..? ఆ కాళ్ళమువ్వల సవ్వడికి... నా గొంతు శృతి పలికింది.. నా కళ్ళే కాదు సుమా..! అందరి కళ్ళు ఆ సుందరిపైనే...

అడుగులో అడుగు కలిపాను... కర్నూలు బస్సు ఎక్కేసింది... ఆమెతో బాటే నేను ఎక్కేసాను... "కర్నూలుకు ఒక టికెట్ ఇవ్వండి" అవి పలుకులా..? కాదు, కోకిల పాటలు... నేను ఒక టికెట్ తీసేసా... పక్క సీట్లో ముసలావిడ జతలో కూర్చుంది... 'ఆ ముసలావిడ నేనే గనక అయివుంటే ఎంత బాగుండేది..' అని నా మనసు అనుకోగానే... 'ఆ వయసులో ఎంజాయ్ ఏంట్రా వెధవా...' అంటూ నా అంతరాత్మ తిట్టింది... పక్క సీట్లో కూర్చున్నాను. పేరు కనుక్కోవాలి... ఊరు తెలుసుకోవాలి... మాట కలుపుకోవాలి... మనసు తెలుపుకొని మనువాడుకుంటే... నా అంతటి మగోడు ఈ సీమలో వుంటాడా..? వుండదు.

"అమ్మాయ్ నీ పేరేంటీ..?" నేనే ముందుగా అడగాల్సిన ప్రశ్న ముసలావిడే అడిగేసింది. 'నవ్య' అంది... ఈ అందానికి ఈ పేరు తగదేమో... ఇదినా ఒపీనియన్.. "మీ ఊరేది"... ఇది కూడా నేనే అడగాల్సింది... ముసలావిడే అడిగేసింది. "కర్నూలు పక్క చిన్న పల్లె..." ఆహా... ఆ పల్లె... మా పల్లి అయి వుంటే ఎంత బాగుండు... ఎంత అదృష్టం చేసిందో ఆ పల్లె...

"మీ నాన్నగారు ఏం పని చేస్తారు?" నోట్లో వక్కాకు పక్కిటి మారుస్తూనే... పుట్టు పుర్వోత్తరాలన్ని అడిగేటట్లుంది ముస ల్ది...నేను అడగటానికి ఇంకేం మిగులుంది."గుళ్ళకి రాయి మలుస్తాడు" అంది నవ్య..ఈ రాయలసీమలో రాయల్ ఫ్యామిలి వీళ్ళదే అయివుంటుంది అనుకున్నాను... రాళ్లు కొట్టే ఫ్యామిలీనా...? ఔన్లే... రాళ్ళతో ఎన్ని అందమైన శిల్పాలు మలచకూడదు..! వీళ్ళ ఇంటికి ఈవిడే ఓ పాలరాతి శిల్పం.

"ఏం చదువుకున్నావ్..?" ముసలావిడకు ఇవన్ని అవసరమా? అంటూ లోలోనే తిట్టుకున్నాను... "బి.కాం. కంప్యూటర్" అంది నవ్య... వున్న ఒక్క ఛాన్సు అడిగేసింది... పరిచయానికి కావాల్సిన ఆ నాలుగు ప్రశ్నలు ముసల్దే అడిగేసింది... ఇంకేం మిగులుంది బొంద! ముసల్ది బస్సు దిగి వెళ్ళిపోతే సీటు మిగులుతుంది... ఎక్కడ దిగి చస్తుందో... లోలోనే నసుక్కోక తప్పలేదు... ఎలాగైనా ముసలావిడ్ని రిక్వెస్ట్ చేసుకోవాలి.

"అవ్వ... మీదేవూరు..." దీర్ఘిస్తూ అడిగాను... "బండమీద పల్లి నాయనా..." అనగానే 'బండ క్రిందవున్నా బాగుండు..' అనుకున్నా లోలోన... "తాతగారు బాగున్నారా..?" చిరు మందహాసంతో అడగక తప్పలేదు... చటుక్కన నా వైపు తిరిగింది... ముఖాన బొట్టులేదు... తాతయ్య బకెట్ లాగి తన్నేసినట్టున్నాడు... "పోయాడు" అనేసింది ముఖం మీదే ముసల్ది... 'పోయాడా? పంపిం చావా..?' ఇది నా మనసులో మాట.. పైకి అంటే ఏమైనావుందా.. పుక్కి ట్లో ఒక్కాకు నా ముఖం మీద వుంచదామరి..!

"ఎక్కడ దిగాలవ్వ..." అడగక తప్పలేదు.. "హైదరాబాదు వెళ్ళాలి..." అంది... అంతే నా గొంతులో వెలక్కాయ పడ్డట్టు అయ్యింది. ఇక ప్రయోజనం లేదు. రూటు మార్చాల్సిందే... "వాంతి వచ్చేటట్టుంది... ఆ పక్క కాస్త సీటు ఇస్తే..." అంటే ఆగిపోయాను... "నీ పక్కన కూర్చున్న అతన్ని ఈ పక్కకు రమ్మని చెప్పి... నువ్వు ఆ పక్కన కూర్చో..." అమ్మ నాయవ్వే... ముసలిబుర్రకి ఇంత పదను వుందా అనుకున్నాను... "ఆయన పరిస్థితి అలా గే వుం దవ్వ...బస్సెక్కిన దగ్గర్నుంచి రెండుసార్లు వాంతి చేసుడు పాపం..." అనగానే టక్కున కన్నులు పెద్దవి చేసి నా వైపు చూసాడు నా పక్కన కూర్చున్న అతను. తిన్నగా కన్నుకదిపి అతని కోపాన్ని అని చేసాను.

ఏం చేద్దాం... అందమైన పువ్వుని అందుకోవాలంటే... అబద్దం ఆడాలిమరి.. "అలాగే రా నాయన" అనగానే "మాయవ్వే..." అంటూ మెచ్చుకొని... చకామని లేచి అవ్వ సీట్లోకెళ్ళి నవ్య పక్కనే అసీనమయ్యాను.

బస్సు వేగంగా వెళ్తోంది... గాలికి ఓని నా చేతిని అప్పుడప్పుడు తాకుతుంటే... ఈ జన్మకి ఈ స్పర్శచాలనుకున్నాను... ఎంత తిప్పుకుందామన్న నా కళ్ళు కలువరేఖల్లాంటి ఆమె చెవి కొనలను కోరి కోరి చూస్తున్నాయి... "అబ్బాయ్... వాంతి కాలేదా?" ముసలావిడ ప్రశ్నకి చిరాకేసింది. 'నీకు విరోచనాలు అయినా బాగుండు పానకంలో పుడకలా నీ నస ఒకటి...' మనసులో అనుకొని, కిటికీ వంక తలపెట్టి బలవంతపువాంతి చేసుకున్నట్టు నటించాను. ఇది ఒకందుకు మేలైంది... నవ్య దగ్గర వాటర్ బాటిల్ వుంది. ఆమెను మాట్లాడ్డానికి మంచి తరుణోపాయం దొరికింది.

"ఎక్స్‌క్యూజ్‌మీ... వాటర్ బాటిల్ ఇస్తారా..." ముక్తసరి కంఠంతో అడిగాను. "తీసుకోండి" అంటూ అందించింది నవ్య... రన్నింగ్ రేస్‌లో ఫస్ట్ వచ్చినందుకు మా ప్రిన్సిపాల్ నాకు గోల్డ్‌కప్ అందించినప్పుడు కూడా ఇంత సంతోషం లేదు. అందుకొని నోరు శుభ్రం చేసుకున్నట్టు నటించాను. వెనక్కి ఇస్తూ "థ్యాంక్స్" అనిన నా మాటకు "పరవాలేదు" అనిన నవ్య మాటతో నా ముఖం సంతోషంతో విచ్చుకుంది.

బస్సు ఆగిపోయిందా? లేదు.. డ్రైవరే అపేసాడు. పక్కనే హోటల్, అందరూ వెళ్తున్నారు... నవ్య కూడా లేచి ముందుకు కదిలింది... నేను కూడా వెళ్ళాను. ముసల్ది మాత్రం ముడుచుకొని అక్కడే కూర్చుంది. అడ్డు తొలిగిందిలే అనుకున్నాను. హోటల్‌లో నేను నవ్య ఒకే టేబుల్‌లో ముఖాముఖిగా కూర్చున్నాం... సర్వర్ వచ్చి ముందుగా నవ్యనే అడిగాడు. "రెండు ఇడ్లీ" అనేసింది... నా వైపు తిరిగి 'ఏమీ' అన్నట్టు చూసాడు.. "నాక్కూడ అంతే..." అనేసాను. ఓరకం టిగా నా వైపు చూసింది నవ్య... అబ్బా! అది చూపా? కాదు వలపు బాణం...నా గుండెల్లో గుచ్చుకుందనుకో... తినటంలో సమానంగా వచ్చాను.. బిల్లు చెల్లించాక బస్సెక్కాం.

"అబ్బాయ్ వాంతులు తగ్గిపోయాయా...?" ఈ ముసల్ది ఒకతి నా ప్రాణానికి... "అబ్బే... లేదవ్వ... బస్సుకదిల్తే మొదలవుతాయి..." అంటూ కూర్చున్నాను... "ఇంతకూ నీ పేరేంటీ" పరిచయం చేసుకొనేటప్పుడు నవ్య నన్ను అడగాల్సిన ప్రశ్న ఇది. ముసలావిడే అడిగేసింది. "గోపి" అన్నాను. ఆ గోపాలునికి పదహారు వేల మంది గోపికలు... ఈ గోపికి ఒక్క అమ్మాయి కోసం ఇన్ని తిప్పలు...

బ్యాగ్‌లో నుంచి పుస్తకం తీసింది నవ్య..పుస్తకంలో ఒక్కొక్క పేజీ తిరుగుతున్నాయి... ఆమె వ్రేళ్ళు.... అవి వ్రేళ్ళా...? కాదు పాలరాతి పలకాలు... ఎంత నునుపుగా వున్నాయి... బస్సు కదిలింది... తీక్షణంగా నవ్య వైపే చూస్తున్నాను... పచ్చని పైర్లను... ప్రకృతి అందాల్ని... అమ్మాయి సొగసుని... చూసే ప్రతి వారిలోను ఒక కవి ఉధ్భవిస్తాడు... నేను కవిని కాను... ఆమె ముఖవర్చస్సును చూడగానే...

నాలో కవి నిద్రలేచాడు... మనసులోనే కవితను అల్లుకున్నాను. నవవసంతపు చిగురుల... నవ మోహన రాగంలా... నవ జీవన సౌందర్య లహరిలో... పల్లవి చరణములు నీవు కావా.... అవి అధరములా ... కాదు అమృత భాండములు... అవి చూపులా... కానేకాదు... వశీకరణ కాంతుల... ఈ జన్మకు ఈ స్పర్శచాలు నవ్య... వచ్చే జన్మకు అర్ధనారీశ్వరుల్లా జీవిద్దాం...

'ఆహా! నేనెంతటి కవిసార్వభౌమున్ని...' నాకు నేనే పొగడుకున్నాను... అందాన్ని అందుకోవటానికి ఆరు సముద్రాలైనా ఈదగలం...బస్సు మళ్ళీ ఆగింది... చిల్లర వ్యాపారస్తు లు బెల్లానికి ఈగలు ముసిరినట్టు బస్సు చుట్టూ మూగారు.. "ఐస్... ఐస్... అంటూ వచ్చాడు ఒక పిల్లాడు... "ఐస్ తింటారా...?" అని అడిగా డు మెల్లగ... "అబ్బే వద్దులేండి... ఐస్ తినను జలుబు చేస్తుంది..." అంటే నవ్య మాట ముగియకముందే "నాక్కూడా అంతేనండి" అని మాట కలిపేసాను... అంతే ఓరకంటగా చూసింది... "బిస్కెట్ బిస్కెట్" అంటూ వచ్చాడు ఒకతను... "బెస్కెట్ తింటారా..?" నాది నోరా..? కాదు పారే సెల ఏరు... ఏరు నిలుస్తుందేమోగాని... వాగే నా నోరు నిలవదుగాక నిలవదు... "వద్దులేండి" అనేసింది నవ్య... "పరవాలేదులేండి" అంటూ ఒక ప్యాకెట్ కొనుగోలు చేసి ఇద్దరం తింటూ కూర్చున్నాం...

నవ్య ఒడిలో ఒదిగివున్న పుస్తకం వైపు మరలాయి నా చూపులు "పుస్తకం ఇస్తారా..." అని అడగటం పూర్తి కాక మునుపే టపీమని పుస్తకం అందించింది. అది ప్రేమ రసా కావ్యం ఆహా... ఎంత అద్భుతంగా వర్ణించాడు కవి.. అంటే నవ్యకు నవలల పిచ్చి వుందన్న మాట... "మీరు ఇలాంటి నవలల ఎక్కువ చదువుతుంటారా?" అడిగిన నా ప్రశ్నకు 'ఔను' అన్నట్టు తల ఆడించింది.. నోటి దురద వూరకనే పో తుందా.. "నేను కూడా అంతేనండి" అనేసాను. 'వీడెవర్రా బాబు' అనుకుందేమో ఈసారి కాస్త కటువుగా చూసింది... డీసెంట్‌గా పుస్తకం చదవటం మొదలు పెట్టాను.

బస్సు ఆగింది... అందరూ దిగేసారు... నవ్య క్రిందకు కాలు పెట్టిందో లేదో... "హాయ్ నవ్య.., ఎలా వున్నావ్..," అంటూ ఒకరు "ఎన్నాళ్ళయిందే నిన్ను చూసి" అంటూ మరొకరు, తన ఫ్రెండ్స్ అందరూ చుట్టుముట్టారు... కోడి పిల్లను డేగ తన్నుకుపోయినట్టు... నవ్యను నాకు కనిపించకుండా ఎక్కడ తన్నుకు పోతారోనని... కంగారు పడ్డాను. అలా వాళ్ళు మాట్లాడుకొంటూ... ముందుకు వెళుతుంటే... గాలికి చెదిరిపోతున్న జుత్తును సవరించుకొంటూ... కాస్త దూరంగా వారి వెనుక నడుస్తున్నాను...

"అరే అబ్బాయ్... ఈ బ్యాగు కాస్త మోస్తావా..." వెనక నుండి ముసలావిడ గోడు 'నీవు చచ్చాక... నీ పాడి మోయమన్న మో స్తాను గానీ... ఇప్పట్లో ఈ బ్యాగు మోయలేను...' మనసులో అనుకొంటూ... ఏమీ వినపడ్డట్టు ముందుకు కదిలాను..

ఎలాగైనా నవ్యను అనుసరించాలి... పరిచయం ఇంకా పెంచుకోవాలి... ఈ వాతావరణంలో ఇవన్ని సాధ్యమేనా? పట్టుదల వుంటే కానిది లేదు... ఎప్పుడో చిన్నప్పుడు చదువుకున్న పాఠం మనసుకొచ్చింది... దాన్ని ఆధారం చేసుకొని, ధైర్యంగా ముందుకు కది

**మిగతా వచ్చే వారం**

# సూర్య బుడత








## వేటాడే స్లిప్పరి

పాముల్లో అనేక రకాలను అడవుల్లో చూడగల్గుతాం. బొమ్మలో ఉన్నది గోల్డెన్ ఐలాష్ వైపర్. దీన్నే స్లిప్పరీ అనీ పిలుస్తారు. ఇది ఆకుల మధ్యలో, పువ్వుల మీద ఉంటుంది. తన ఆహారాన్ని సులభంగా పసిగట్టగలదు. దాని నాలుక, తల మీద గుంటలు తనకు కావాల్సిన క్రిమికీటకాలు, చిన్నపాటి జంతువులు ఎంత దగ్గరలో ఉన్నది పసిగట్టి కాటేస్తుంది. ఆ వెంటనే నోటిలోకి లాగేసుకుంటుంది.

## రివర్ ఆట



నీళ్ల దగ్గర విశ్రాంతి తీసుకుంటున్న ఈ జంతువు పేరు ఆటర్. ఇది ఆరు అడుగుల మేరకు పెరుగుతుంది. నదుల్లో ఉండే ఈ జంతువు గుల్లలు పట్టి పైకి తెచ్చి రాతి మీద కొట్టుకు తింటుంటుంది. ఈ జాతిలో ఇంత పెద్దది ఈ రివర్ ఆటరే!





## రాజు కప్ప



మనకు సహజంగా కనిపించే కప్పల కంటే ఇది ఎంతో వింతైనది. నీటిలోను, బురదనీటిద గ్గర కనిపించే కప్పలకీ గాజు కప్పలకీ తేడాఉంది. ఈ కప్ప గాజు బొమ్మలా ఉంటుంది. శరీరం పైభాగం మాత్రం ఆకుపచ్చగా ఉంటుంది. నీటి మీదకి వంగి వుండే చెట్ల కొమ్మల మీదనే ఎక్కువగా ఉంటుంది. ఆ కొమ్మల రంగుల్లో దాక్కుంటుంది. క్రిమి కీట కాలు దగ్గరికి వచ్చినపుడు అమాంతం పట్టేస్తుంది. దీనికి శత్రు భయం ఎక్కువ.

## చిన్న కోతి

ప్రపంచంలోని అన్ని కోతులకంటే బుజ్జి కోతి ఇది. దీని పేరు మార్మోసెట్. పిగ్మీ అనీ పిలుస్తారు. ఇది అమెజాన్ అడవుల్లో చెట్ల పైన నివసిస్తుంది. పళ్లు, కీటకాలనే తింటుంది. ఈ బుజ్జి కోతిని జేబులో పెట్టేసుకోవచ్చు. అంత చిన్న కోతి ఇది. ఈ తరహా కోతులు అంతకంటే పెరగవు.

బీర్బల్ కళ్ళు మూసుకుని ఏవో మంత్రాలు చదువుతుండటాన్ని చూశాడు. అక్బర్. అవి తనకూ చెప్పించమని అడిగాడు.

రాజా, ఇవి జాగ్రత్తగా ఒక గురువు దగ్గరే నేర్చుకోవాలి" అన్నాడు బీర్బల్.అయితే అక్బర్ "ధ్యానం చేయడం తెలిసినవాళ్ళు దగ్గర నేర్చుకోలేమా? గురుముఖత నేర్చుకోవాల్సిన అవసరం ఏమిటి?' అన్న ఉద్దేశంతో, రాజ్యాధికారంతో వేరొకరి దగ్గర నేర్చుకుని బీర్బల్‌కు చెప్పి చూపించాడు.

అది విన్న బీర్బల్ "పదాలన్నీ అవే రాజా! అయితే వాటిని గురువు దగ్గర నేర్చుకున్నపుడే దానికి మహిమ" అన్నాడు.

"పదాలు మారనపుడు అవి ఎవ రు నేర్పిస్తేనేమి?" అని విసుక్కున్నాడు అక్బర్. బీర్బల్ చప్పట్లు చరిచి కావలవాళ్లను పిలిచాడు.

"ఈ మూఢుడిని పట్టుకెళ్లి చెరలో పెట్టండి" అని అక్బర్‌ను చూపించాడు. సిపాయిలు ఆశ్చర్యపోయారు.

బీర్బల్ మళ్ళీ మళ్ళీ సిపాయిలను ఆదేశించాడు. కానీ అక్బర్ దగ్గరికి రావడానికి భయపడ్డారు. బీర్బల్ చర్యకు కోపగించుకున్నాడు అక్బర్. "నన్ను బంధించమనడానికి నీవెవరు? వీరిని ముందు చెరలో పెట్టండి" అని ఆదేశించాడు.

అంతే వెంటనే సిపాయిలు బీర్బల్‌ను పట్టుకున్నారు. అపుడు బీర్బల్ నవ్వుతూ "చూశారా, రాజా, అవే పదాలు నేనన్నపుడు కదలని వారు మీరు ఆదేశించగానే మరో ఆలోచనలేకుండా నన్ను పట్టేసుకున్నారు" అన్నాడు.అప్పటికి గాని గురువు దగ్గరే నేర్చుకోవాలన్న బీర్బల్ మాటల్లోని నిజాన్ని గుర్తించాడు అక్బర్.

## రంగుల ప్రభావం



ఏ వస్తువైనా మనకు రంగుగా కనపడటానికి కారణం ఆ వస్తువు సూర్యరశ్మి అందులోని ఏదో ఒక రంగు కిరణాలను వెలువరించడమే. కారణం. సూర్యరశ్మిని పూర్తిగా పరావర్తనం చెందించిన వస్తువులు తెల్లగా ఉంటాయి. ఏ రంగు కిరణాలను పరావర్తనం చెందించకపోతే నల్లగా కనిపిస్తాయి. మేఘాలకు రంగులు కూడా ఈ విధంగానే ఏర్పడతాయి. మేఘాలు సూర్యరశ్మిలోని ఏ రంగు కిరణాలను వెదజల్లితే అవి ఆ రంగులో కనపడతాయి.

## చుక్కలు కలపండి!



## రంగులు వేయండి!



## ఎన్ని పతకాలు ఎంత సొమ్ము వెచ్చిస్తున్నారు?

ఒక ప్రముఖ కోచింగ్ సెంటర్ రిజల్ట్స్ రాగానే ఇలా అన్ని పేపర్స్ లో ప్రకటన ఇచ్చింది. మా ఫౌండేషన్ నాడు మా స్టూడెంట్స్ ని గొప్పగా సత్కరిస్తున్నాము. 50% పైన మార్కులు తో పాసైన 286 స్టూడెంట్స్ అందరికి రూ 1000 కేష్ తో తామ్ర పతకాలు ఇస్తున్నాము, 60% పైన మార్కులు తో పాసైన 123 స్టూడెంట్స్ అందరికి రూ 2000 కేష్ తో రజత పతకాలు ఇస్తున్నాము. 70% పైన మార్కులు తో పాసైన 42 స్టూడెంట్స్ అందరికి రూ 3000 కేష్ తో బంగారు పతకాలు ఇస్తున్నాము. 80% పైన మార్కులు తో పాసైన 8 స్టూడెంట్స్ కి రూ 5000 కేష్ తో బంగారు పతకాలు ఇస్తున్నాము. 90% పైన మార్కులు తో పాసైన ఇద్దరి స్టూడెంట్స్ కి రూ 10000 కేష్ తో బంగారు పతకాలు ఇస్తున్నాము. ఫౌండేషన్ నాడు ఆ కోచింగ్ సెంటర్ ఎన్ని తామ్ర, రజత, బంగారు పతకాలు ఇస్తున్నారు. కేష్ అవార్డ్స్ కి ఎంత సొమ్ము వెచ్చిస్తున్నారు.

జవాబు: -163 తామ్ర, 81 రజత, 42 బంగారు పతకాలు, సొమ్ము మొత్తం రూ 481000 ఇస్తున్నారు. రూ 163000 తామ్ర, రూ 162000రజత, రూ 156000 బంగారు (70% 3000 32= రూ 96000, 80% 5000 8 =రూ 40000 90% 100002= రూ 20000 ) అసలు ఆ కోచింగ్ సెంటర్ మొత్తం స్టూడెంట్స్ 286.

**చామర్తి వెంకట రామ కృష్ణ**
హైదరాబాద్-201 మర్కజ్ మర్యాద అపార్ట్మెంట్స్
అడిక్మెట్, హైదరాబాద్ 500044



ఒక తెలివి తక్కువ స్త్రీ ఒక తెలివైన పురుషుణ్ని అదుపులో పెట్టవచ్చు. కాని అతి తెలివైన స్త్రీని అదుపులో పెట్టడానికి పురుషుడు మూర్ఖుడై వుండాలి. -రుడ్యార్డ్ కిప్లింగ్

# బలగం గోరంత... బాధ్యత కొండంత



హైదరాబాద్ నగరంలో ఉగ్రవాద సంస్థల హెచ్చరికలతో తరచూ అలజడి. పండుగ పర్వదినాల్లో మత విద్వేషాలు చెలరేగుతాయన్న ఆందోళన. పాతబస్తీలో అరబ్‌షేక్‌ల ఆగడాలు. బంగారు దుకాణాల్లో రాత్రికి రాత్రి భారీ చోరీలు. ఉపాధి, విదేశాల పేరిట బడా మోసాలు. లైంగిక వేధింపులు, అత్యాచారాలు, దారుణ హత్యలు, చైన్ స్నాచింగ్ తదితర నేరాలతో నగరం అట్టుడికిపోతోంది. విధుల విషయం అటుంచితే పోలీసులు ఉరుకులు పరుగులు పెట్టడంతోనే సరిపోతోంది. వెరసి తెలుగు రాష్ట్రాల ఉమ్మడి రాజధానిలోని పోలీసు వ్యవస్థ బలగం గోరంత, బాధ్యత కొండంత అన్న చందంగా మారింది. ఉన్న కొద్దిపాటి సిబ్బందితో శాంతిభద్రతల పరిరక్షణ ఇబ్బందిగా మారిందని చెప్పవచ్చు. ఢిల్లీ నగరంలో దాదాపు 60వేల మందికిపైగా పోలీసులు విధులు నిర్వహిస్తున్నారు. అలాగే కోల్‌కతా, ముంబై, బెంగళూరు నగరాల్లో 30వేల మంది పోలీసులు విధుల్లో ఉన్నారు. కాగా దేశ రెండవ రాజధానిగా గుర్తింపు పొందిన హైదరాబాద్ నగరంలో కేవలం 9వేల మంది పోలీసులే ఉన్నారన్నది అక్షర సత్యం. అరకొర సిబ్బందితో ఇటు నేరాలను అదుపు చేయలేక, ఇటు శాంతిభద్రతలు అందించలేక నగర పోలీసు ఉన్నతాధికారులు తలలు పట్టుకుంటున్నారు. తెలుగు రాష్ట్రాల ఉమ్మడి రాజధానిలో నిత్యం మూడు దారుణాలు..నాలుగు దుర్మార్గాలు చోటుచేసుకుంటున్నాయి. తెలుగు రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాలకు చెందిన నేరస్తులకు హైదరాబాద్ నగరం అడ్డాగా మారుతోంది.

వివిధ బ్యాంకులలో భారీ చోరీలు, అత్యాచారాలు, అపహరణలు తదితర నేరాలతో రాష్ట్ర రాజధాని అట్టుడికి పోతోంది. రాష్ట్రంలో ఏదో ఒక చోట నిత్యం భారీ నేరం చోటుచేసుకుంటూనే ఉంది. నగరంలోని మహేష్‌బ్యాంక్‌కు కన్నం వేశారు. ఈక్రమంలో నేరస్తుల వీరంగానికి పోలీసుశాఖ వీస్తూ పోవడం తప్పం వాటిని అరికట్టడంలో విఫలమవుతోంది. ఒకదశలో పోలీసుశాఖ నేరాలను అరికట్టలేని స్థితికి చేరుకుందా అన్న అనుమానాలు రేకెత్తుతున్నాయి. గతంలోకంటే ఇటీవల కాలంలో నేరాలు అధికమయ్యాయని పోలీసు రికార్డులు తేటతెల్లం చేస్తున్నాయి. ఇం దులో భాగంగా గత ఏడా దిలో పో లిస్తే రాష్ట్ర వ్యాప్తంగా 20.49శాతం కేసులు పెరిగే అవకాశాలు న్నాయని ప్రస్తుత పరిస్థితులు తెలియజేస్తున్నాయి. ఇటీవల కాలంలో మహిళలపై వేధింపులు 15.11శాతం పెరిగాయి. గడచిన ఆరునెలల్లో అన్ని రకాల నేరాల శాతం 12కు పెరిగాయని, అందులో అధికంగా కిడ్నాప్, అత్యాచారంతో పాటు చోరీలు, ఆర్థిక నేరాలుండటం గమనార్హం. తెలుగు రాష్ట్రాల ఉమ్మడి రాజధానిలో పోలీసుశాఖ సిబ్బంది కొరతతో తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటోంది. ఉన్న అరకొర సిబ్బంది నాయకుల సేవలో తరిస్తూ సేదతీరు తుండటం గమనార్హం. రాష్ట్రంలో జడ్‌ప్లస్, జడ్, వై, వైప్లస్ భద్రత కల్గివున్న నేతలతోపాటు మాజీ డిజిపి, ఇతర అధికారుల నివాసాల్లో ఏళ్లతరబడి వారి సేవల్లో పోలీసులు తరిస్తున్న విషయం విధితమే. నేతల భద్రతకే అధిక సం ఖ్యలో పోలీసు సిబ్బందిని నియమించాల్సి వస్తోంది. ఈ నేపథ్యంలో రాష్ట్రంలో పోలీసుల సంఖ్యతో పోలిస్తే నేర స్వభావం, వివిధ నేరాలతో సంబంధం ఉన్న వారే అధికంగా ఉన్నట్లు తెలుస్తోంది. ముఖ్యంగా రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లో కేవలం 9వేల మంది పోలీసులు విధులు నిర్వహిస్తుడటం గమనార్హం. ఈ క్రమంలో ఢిల్లీ, ముంబై, కోల్‌కతా, బెంగళూరు నగరాల్లో 20నుంచి 35వేల వరకు పోలీసు సిబ్బంది విధులు నిర్వహిస్తున్నారు. అయితే తెలుగు రాష్టాటల ఉమ్మడి రాజధానిలో కేవలం 9వేల మంది పోలీసులతో శాంతిభద్రతలకు ఉపయోగిస్తుండం విచారకరం. ఉన్న సిబ్బందిలోనే ప్రముఖ నేతలకు భద్రత, ట్రాఫిక్ నియంత్రణ, వివిధ కేసుల్లో సమన్ల జారీ తదితర పనులు అధికశాతం పోలీసులను వినియోగిస్తున్నారు. ఈ నేపథ్యంలో శాంతిభద్రతలు, నేరాల నియంత్రణకు కేటాయించే సిబ్బంది స్వల్ప సంఖ్యలో ఉన్న కారణంగా నేరాల శాతం పెరుగుతోందని చెప్పవచ్చు. నగరంలోని సైనిక్‌పురిలో కెనరా బ్యాంక్‌లో 78లక్షల రూపాయలు చోరీ చేసిన ఘటన ఇంతవరకు మిస్టరీ వీడలేదు. అలాగే గతంలో ఒక మహిళను హతమార్చి సూట్‌కేసులో వదిలి వెళ్ళిన ఘటన ఇంతవరకు మిస్టరీగా మిగిలింది. నగరంలోని భారీ సంఖ్యలో చైన్‌స్నాచింగ్‌ల కేసులు పలు పోలీస్‌స్టేషన్స్‌లో మిస్టరీగా ఉన్నాయి. ఇక ద్విచక్ర వాహనాల, భారీ వాహనాల మిస్సింగ్ కేసులకు సంబంధించి చిక్కుముడి వీడనివి లక్షల్లో ఉన్నాయన్నది సమాచారం. ఇళ్లకన్నాలు, గొలుసుకట్టు నేరాల సంఖ్య గణనీయంగా ఉన్నాయి. నేరాల నియంత్రణ కన్నా నేరాలు జరిగాక పోలీసుల హడావిడి చేస్తున్నారన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. వెరసి రాష్ట్ర రాజధానిలో నేరస్తులకు అడ్డాగా మారిందన్న విమర్శలు వినిపిస్తున్నాయి. కాగా రాష్ట్ర రాజధానిలో ఇతర నేరాలతో పాటు అరబ్‌షేక్‌ల ఆగడాలు, బాలికల అదృశ్యాలు, తదితర నేరాల ఘటనలు అధికమవు తున్నాయి. నేరాల విషయంలో ఇతర రాష్ట్రాల రాజధానులతో పోలిస్తే రాజధాని నగరంలో రోజురోజుకు విస్తరిస్తుండటంతో హైదరాబాద్, సైబరాబాద్ ప్రాంతాల్లో నేరాలు అధికంంగా జరుగుతున్నట్లు పోలీసుల అధికారులే పేర్కొంటున్నారు. మహానగరంలో నేరాల నియంత్రణకు పోలీసుశాఖ ఉన్నతాధికారులు వ్యూహాత్మకంగా వ్యవహరించాల్సిన అవసరం



ఎంతైనా ఉంది. నేరాల నియంత్రణకు ఉపయోగిస్తున్న బలగాలు, విభాగాలను బలోపేతం చేసి నేరస్తులను కట్టడిచేయని పక్షంలో పోలీసుశాఖ మరింత అపఖ్యాతి మూటకట్టుకోవాల్సి వస్తుంది. అదేవిధంగా పోలీసుశాఖలో వివిధ హోదాల్లో పనిచేసి పదవీ విమరణ పొందిన వారికి ఆర్డర్లీగా కేటాయించే సిబ్బందిలోనూ కోత విధించాల్సిన అవసరం ఉంది. ఇప్పటికైనా నగరంలో శాంతిభ ద్రతల కోసం ప్రత్యేక పోలీసు నియామ కాలు చేపట్టాల్సిన అవశ్యకతను ఆశాఖ ఉన్నతాధికారులు గుర్తించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.



చెన్నూరి నాగశ్రీధరశర్మ,
సీనియర్ జర్నలిస్టు

# సంఖ్యా శాస్త్రం

1) జ్యోతిష్య శాస్త్రము 2) సాముద్రిక శాస్త్రము 3) సంఖ్యా శాస్త్రము. ఏ శాస్త్రము అయినా మానవుడికి జరిగే సుఖ సంతోషాలు, కష్టసుఖాల గురించి సూచించే శాస్త్రములే ! భవిష్యత్తు గురించి తెలుసుకోవటానికి చేసే ప్రయత్నమే!

జ్యోతిష శాస్త్రము 27 నక్షత్రములు, 12 రాశులయొక్క గణితము మీద ఆధారపడి చెప్పబడుతున్న శాస్త్రము.

సాముద్రిక శాస్త్రము – ఆ వ్యక్తి అరచేతిలో ఉన్న రేఖలను గమనించి ఆ రేఖల ప్రభావం వల్ల జరిగే విషయముల గురించి చెప్పు శాస్త్రము.

సంఖ్యా శాస్త్రము – ఇది సంఖ్య యొక్క ప్రభావం వల్ల ఆ వ్యక్తికి జరగబోయే విషయముల గురించి తెల్పుటకు ఉపయోగపడుతున్నది – ప్రతి మనిషికి ఏదో ఒక సంఖ్య యొక్క ప్రభావం ఉంటుది. ఆ ప్రభావం ఆ వ్యక్తి జీవితం పై చూపిస్తుంది. ఆ సంఖ్యలో పుట్టిన వారికి జరిగే సంఘటనలు ఆ వ్యక్తికి కూడా జరగవచ్చును. ఆ సంఖ్యకు చెందిన గుణగణములు అతనిలో వుండే అవకాశము ఉంది. ప్రతీ మనిషికి ఏదో ఒక సంఖ్య యొక్క ప్రభావం ఉంటుంది. ఆ ప్రభావం అతని జీవితంలో ఉపయోగపడుతుంది.

మన పూర్వికులు, మహా ఋషులు, వారి తపో సంపద చేత, తమ దివ్యజ్ఞానము చేత చెప్పిన విధముగా జ్యోతిషశాస్త్రము మాదిరిగానే ఈ సంఖ్యా శాస్త్రము కూడా మన జీవితంలో ప్రయాణము చేయవలసిన మార్గములను గురించి, మన జీవితంలో జరగబోయే సుఖసంతోషాలను గురించి తెలుసు కొనుటకు ఉపయోగపడుతున్నది. ఈ సంఖ్యా శాస్త్రము మన దేశములోనే మన పూర్వికులు మనకు అందించిన శాస్త్రమే ! మొదటి నుండి మనముందు వారు ఈ శాస్త్రమును తెలుసుకొని ఈ శాస్త్రమునకు ఎంతో ప్రాధాన్యతను ఇచ్చినారు. ఇతర దేశములలో కూడా అ సంఖ్యా శాస్త్రమును చాలా మంది నమ్ముతారు. ప్రపంచములోని దాదావు అన్ని దేశముల వారు అ సంఖ్యా శాస్త్రమును ఉపయోగించుకొని లాభపడుతున్నారు.

ఈ నెంబర్ల లేక ఈ సంఖ్యలకు సంభంధించిన శాస్త్రమునే న్యూమరాలజీ అంటున్నారు. చాలా కాలం నుండి, చాలా శతాబ్దాల నుండి ఈ అంకెలలో చాలా మహత్తు కలదు. ప్రతీ స్త్రీకి, ప్రతీ పురుషుడికి ఏదో ఒక నెంబర్ ప్రభావం తప్పని సరిగా ఉండి తీరుతుంది. ఏదో ఒక లక్కీ నంబర్ వ్యక్తి జీవితంలో అద్భుతమైన సంఘటనలు కలుగ చేస్తుంది.

సంఖ్యను లేదా నెంబర్‌ను ఉపయోగించుకొనుట వలన ప్రతీ వ్యక్తి తన పనులలో విజయములు పొందవచ్చును. ఇట్టి అంకెలకు గొప్ప శక్తి ఉంది. ఈ శక్తి వ్యక్తులకు ఉపయోగపడుతుంది. లాభం చేస్తుంది. అదృష్టం ప్రసాదిస్తుంది. గొప్ప గొప్ప విజయములను ప్రసాదిస్తుంది.

ఈ సంఖ్యా శాస్త్రము ఆధారంగా ఒక వ్యక్తి ఏ సంఖ్యకు చెందినవాడు, అతనికి ఏ తేదీలలో మంచి సంఘటనలు జరుగుతాయి. ఏ రంగు దుస్తులు ధరిస్తే అదృష్టం కలిసి వస్తుంది. అతని విద్య సాగుతుందా లేదా, ఎలాంటి వృత్తులు చేసుకొంటే బాగుంటుంది, వివాహ జీవితం ఎలా ఉంటుంది, ఉంగరములో ఏ రత్నమును ధరిస్తే లాభం పొందుతారు, ఏ సంఖ్యలో పుట్టిన వారితో స్నేహం చేయవచ్చును, ఏ సంవత్సరములో పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి, ఆరోగ్యము, ఆదాయం మొదలగు విషయముల గురించి తెలుసుకోవటానికి ఈ సంఖ్యా శాస్త్రము ఉపయోగపడుతుంది.

మీరు ఒక పని చేయాలనుకొంటే మీ సంఖ్యకు చెందిన తారీఖులలో మీ పనులు చేస్తే ఆ రోజు మీరు పనిలో లాభం పొందే అవకాశము, మీ పని జరిగే అవకాశం ఉంది. మీకు మీ సంఖ్యకు చెందిన తేదీలలోనే లాభం జరగటానికి ఎక్కువ అవకాశం వుంది.




ఈ అంకెలలో కొన్ని మంచి చేస్తాయి, కొన్ని సంఖ్యలు కీడు చేస్తాయి. ఈ కీడు చేసే సంఖ్యలను శతృ సంఖ్యలు అంటారు. అందరికీ అన్ని సంఖ్యలు కలసి రావు. కొన్ని సంఖ్యలు చేడు చేస్తాయి. అలాంటి సంఖ్య ప్రభావం వున్న రోజులలో మీరు ఎలాంటి నూతన ప్రయత్నములు చేయరాదు. మీ సంఖ్యకు చెందిన తేదీలలోనే మీ ప్రయత్నములు చేయుట అన్ని విధాల మంచిది.

సంఖ్యాశాస్త్రమునకు మొత్తము 9 సంఖ్యల ఆధారము సంఖ్యలు కూడా తొమ్మిదియే ! ఈ సంఖ్యలు 1,2,3,4,5,6,7,8,9.

ఈ సంఖ్యా శాస్త్రమునకు వ్యక్తి యొక్క పుట్టిన తేదీయే ముఖ్య ఆధారము. మీ పుట్టిన తేదీ ప్రకారం మీరు ఏ సంఖ్యకు చేందిన వారో మొదట తెలుసుకొని ఆ తరువాత మీ సంఖ్య యొక్క గుణగణములు ఏమిటో తెలుసుకొని, మీ సంఖ్య యొక్క ప్రత్యేకత ఏమిటో తెలుసుకొని ఆ తర్వాత ప్రభావం మీ జీవితం పై ఎలా ఉంటుందో మీరు మీ నిజజీవితములో తెలుసుకోగలుగుతారు. మీ అనుభవం మీ సంఖ్య యొక్క ప్రభావం మీ పై ఎలా ఉందని మీరు గుర్తిస్తారు. కాబట్టి ప్రతీ వారు వారి పుట్టిన తేదీ ఆధారంతో వారు ఏ సంఖ్యకు చెందినవారో మొదట తెలుసుకోవాలి !

## జాతకం

# తులరాశి లక్షణాలు

వీరికి వ్యావహారిక విషయాల్లో, ధర్మ న్యాయ విషయాలపట్ల జ్ఞాపకశక్తి అధికంగా ఉంటుంది. తనవారి యందైనను, ఇతరులయందైనను న్యాయ విషయమున నిష్పక్షపాతమైన ప్రవర్తన కలిగియుందురు. చక్కగా మాలాడగలరు. ఆ మాటలలో ఏ విషయమందైనను తుల నాత్మక ధోరణి కనిపించగలదు. సుఖాలలో ఆసక్తి ఉండును. కనిపిస్తుంది. వీరిని అనుసరించే వారు, అనుకరించేవారు, అధికంగా ఉంటారు. తాము చేసిన పనులను సమర్ధించుకొనడంలో అసమానమైన ప్రజ్ఞ వీరికుంటుంది.

వీరిలో కొంత చాంచల్యం ఉంటుంది. ప్రారంభించిన పనిని చివరకు సక్రమంగా నిర్వర్తించి చివరలో వదిలివేసే లక్షణాన్ని వీరు తమ ప్రయత్నంలో మార్చుకోవచ్చును. వీరిలో చురుకుదనం, క్రొత్త ఆలోచనలు, భావావేశం ఉం టాయి. వాటిని సద్వినియోగం చేసుకోవాలంటే ప్రయత్న పూర్వకంగా స్థైర్యాన్ని అలవర్చుకోవాలి. వృత్తులు మార దం తరచూ

తాము ఇచ్చిన వాగ్దానాలు వీరు మరువరు. చేయవలసిన పనులయందు సమయ నియమమును అధికముగా పాటింతురు.

ఏ పనినైనను ఒక క్రమపద్ధతిలో ఆచరించడం ద్వారా కాలాన్ని, ధనాన్ని సద్వినియోగం చేస్తారు. అవకాశాలను విడిచి పెట్టరు. మైత్రిని దుర్వినియోగం చేయరు. వీరు వ స్తుసేకరణ, వాని వినియోగం, అలంకరణ మొదలగు వాని విషయంలో ఒక క్రమపద్ధతిని పాటిస్తారు. ఏ స్థానంలో ఏ వస్తువును ఉంచాలో అదే స్థానంలో ఉంచుతారు. ఖర్చు కూడా ఒక క్రమ పద్ధతిలో సాగుతుంది. అనవసర వ్య యం ఉండదు. ప్రతి విషయంలో సరిగా లెక్కలు వేస్తారు. ఈ అతిజాగ్రత్త వలన కొన్ని ఇబ్బందులను కూడ ఎదుర్కొ నడం సంభవిస్తుంది. వీరికి సామాన్యంగా కోపంరాదు గాని, లెక్కల్లో తేడా వస్తే గొప్ప లాభాలొచ్చే పనైనా విడిచి పెట్టి, ఆ తేడా చేసినవారితో సంబంధం విడిచి పెడతారు. ఇంపైన ఆహారమన్నా, శుచిశుభ్రతలన్నా, అందమైన వస్తువులన్నా అధికమైన ప్రీతి. సుందరాలు, విచిత్రాలు అయిన వస్తువులతో అధికమైన ఇంటిని అలంకరిస్తారు. ఇంటిలోని స్థలం కూడ సుందరవృక్షాలతో కనువిందు చే స్తుంది. సుందరమైన చిత్రాలన్నా, కళలన్నా ఆసక్తి అధి కం. చలనచిత్రాలు కూడ వీరికి ఆదాయాన్ని సమకూరు స్తాయి. గ్రామాలలోని సుందర దృశ్యాలు ఆకర్షిస్తాయి. కాని అట లేని సౌకర్యాలు వీరికి అవసరం కాబట్టి గ్రామా లను సందర్శిస్తారేగాని అట వినిపించదు. వీరికి తమ చుట్టూ ఉన్నవారిని ఆకర్షించి అలరించే నేర్పు ఉంటుంది. జనసామాన్యంతో సంబంధాలు అధికంగా ఉండే టి.వి., రేడియో, సినిమాలు, హిప్నాటిజం మొదలైన విషయా లలో వీరి నేర్పు బాగా ఉపయోగిస్తుంది. కాని వీరు తమకు తాముగా ఇతరులతో పరిచయం చేసుకోలేరు. ఎదుటివారే పరిచయం చేసుకుంటే వీరిది పైచేయి అవు తుంది. ఏ



విషయంలోనైనా ప్రారంభ సమయంలో ఇబ్బం ది పడతారేగాని, ప్రారంభించిన పనిని సర్వామోదయో గ్యంగా నిర్వహించగల నేర్పు వీరికి ఉంటుంది. ఎక్కువగా జనాలున్నచోట ఊపిరి సలపదు. ఆ ప్రశాంతత ఉన్నంత సేపూ వీరి మనస్సు ప్రజ్ఞావంతమై రాణిస్తుంది. వీరి ప్రభావం ఇతరుపై బాగా జరుగు తుంది. కాని అలా మారకుండా ఉంటేనే అభివృద్ధి అధికంగా ఉంటుంది. వీరు మొదటి 30 సంవత్సరాలలో స్థిరపడితే అభివృద్ధి బాగుంటుంది.

వీరు దాంపత్య జీవితంలో కొన్ని ఒడిదుడుకులను ఎదుర్కొనవలసి ఉంటుంది. వీరి శరీరంలో కొంత బలహీ నత వుంటుంది. దాని ప్రభావం వలన పాతనొపలు బైటప డుతూండటం కనిపిస్తుంది. వీరికి వాతావరణం మా రితే అనారోగ్యం చేసే లక్షణం ఉంటుంది. 4049 సంవత్సరాల వయస్సులో అనారోగ్యావకాశాలు ఉంటాయి. వీరి దేహం కొంచెం పొడవుగా ఉంటుంది. వీరి మాట, నడత ఇతరుల ను ఆకర్షిస్తుంది. వీరికి బట్టతల వచ్చే అవకాశాలు ఉన్నా యి. వీరి స్వభావం సున్నితంగా ఉంటుంది. ఏ పనియం దైనను నిదానంగా ఆలోచించిగాని నిర్ణయానికి రాలేరు. ఆ నిదానం ఒక్కొక్కసారి ఆలస్యంగా పరిణమిస్తుంది. కొంత బద్ధకము కూడా వీరికి ఆటంకమే. ఇతరుల మాటలు విని ఆలోచించకుండా తొందరపడితే మోసపోవడం మొదలైన అనుభవాలు వీరిని తొందరపడకుండా చేస్తాయి. హాస్య మంటే చాలా ఇష్టం. ఇతరులకు ఉపకారం చేయడం వీరి స్వభావంలోనే మిళితమైపోతుంది. ప్రయాణాలన్నా, తీర్థయాత్రలన్నా ఇష్టం అధికం. గౌరవానికి ప్రాముఖ్యం ఇస్తారు. ఇతరుల ధనం ఆశించరు. దైవికమైన కార్యాలన్నా, సాంఘిక కార్యాలన్నా ఆసక్తి ఉంటుంది. కోపం త్వరగా వచ్చినా అది ఎంతోసేపు నిలవదు. వీరికి అనారోగ్యం చేసినా అలాగే తొందరగా తగ్గిపోతుంది.

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ..................................

పుట్టిన తేదీ : ..................................

పుట్టిన సమయం : ............................

పుట్టిన ఊరు (మండలం) : ..................

ప్రశ్న : ..................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.

## 16-4-2017 నుండి 22-4 -2017 రాశిఫలం



మేషం:Aries( అశ్విని, భరణి, కృత్తిక - 1) : కోర్టు సమస్యలు పరిష్కారం అవుతాయి. విష జంతు వుల వలన భయం. ఒక రహస్య సమాచారం తెలుస్తుంది. అక్రమ సంపాదన వస్తుంది. మీకు సంబంధం లేని సమస్యలలో తలదూర్చి చిక్కులు తెచ్చుకుంటారు. ఆర్థిక సంస్థల నుండి ఋణం లభిస్తుంది.



వృషభం:Taurus (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2)::కొత్త విషయాలు తెలుసుకుంటారు. అనుకోని ధనలాభం కలుగుతుంది. కళారంగంలో ఉన్నవారికి గుర్తింపు లభి స్తుంది. మీ పిల్లల యొక్క ఉన్నత విద్య కొరకు తగిన ఏర్పాట్లు చేస్తారు. గతంలో మీరు ఇచ్చిన ధనం వడ్డీ తో సహా తిరిగి వస్తుంది. ప్రభుత్వ ఉద్యోగులకు ఆదాయం పెరుగుతుంది. స్త్రీలకు మంచి ఉద్యోగం లభిస్తుంది. వ్యక్తిగత హోదా పెరుగుతుంది. వృత్తిరీత్యా అధికారులను కలుసుకుంటారు.



మిధునం: Gemini (మృగశిర -3,4, వృత్తిలో ఏర్పడుతున్న అడ్డంకులు తొలగుతాయి. మీ విరోధులు మిత్రులుగా మారి మీ అభివృద్ధికి సహకరిస్తారు. భగవంతుని పై నమ్మకం పెరుగు తుంది. నరాలకు సంబంధించిన వ్యాధులు కలుగుతాయి. గురు సమానులైన వ్యక్తులు మీ గృహాన్ని సందర్శిస్తారు. స్త్రీలకు ఉద్యోగ అవకాశాలు వస్తాయి.



కర్కాటకం: Cancer(పునర్వసు -4, వృత్తిలో గుర్తింపు లభిస్తుంది. ఆర్థిక సమస్యలు పరిష్కరించబడతాయి. విద్యార్థులు ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వాయు సంబంధ రోగాలు వస్తాయి. తల్లిగారి తరుపు నుండి ఆర్థిక సహకారం లభిస్తుంది. అధికారంలో ఉన్నటువంటి స్త్రీతో విభేదాలు వస్తాయి. భార్యతో ఎడబాటు వస్తుంది.



సింహం:Leo (మఖ, పుబ్బ, ఉత్తర -1):మిత్రుల సహకారంతో ఆర్థిక సమస్యలు పరిష్కరించబడతాయి. మీ కుటుంబంలో ఒకరికి విదేశీ అవకాశాలు వస్తాయి. వృత్తిలో అభి వృద్ధికి గురువుల యొక్క సహకారం లభిస్తుంది. ఆధ్యాత్మిక కేంద్రాలు సందర్శిస్తారు. వృత్తిరీత్యా అధికారుల నుండి ఒత్తిడి వస్తుంది. స్త్రీలతో విరోధాలు వస్తాయి.



కన్య:Virgo ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2):: ఆర్థిక పరిస్థితిలో కొంత మార్పు వస్తుంది. వృత్తిరీత్యా కొంతమంది చెడ్డవ్యక్తులు మీ యొక్క మంచితనాన్ని, తెలివితేటలను ఉపయోగించు కుంటారు. మీకు సంబంధం లేని విషయాల్లో కలుగజేసుకోవద్దు. విద్యార్థులు విద్యపై శ్రద్ధ తగ్గి ఇతర విషయాల్లో శ్రద్ధ వహిస్తారు. చెడ్డ వ్యక్తులతో కలిసి భవిష్యత్తు పాడుచేసుకునే అవకాశం ఉన్నది.



తుల: Libra (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3) మిత్రుల సహకారం లభిస్తుంది. వ్యా పార అభివృద్ధికి మీరు చేయు ప్రయత్నాలు ఫలిస్తాయి. విదేశంలో ఉన్నటువంటి మిత్రుల నుండి సంపూర్ణ సహకారం లభిస్తుంది. గృహం లేదా ఉన్నవూరు నుండి మార్పు కోరుకునే వారి ప్రయ త్నాలు ఫలిస్తాయి. విదేశీ అవకాశాలు వస్తాయి.



వృశ్చికం: Scorpio (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ) అనూరాధ, జ్యేష్ఠ)వృత్తిలో అభివృద్ధి ఉంటుంది. అదనపు ఆదాయం లభిస్తుంది. చాలాకాలంగా రావలసిన ధనం చేతికి అందుతుంది. ఆర్థిక సమస్యలు పరిష్కరించబడతాయి. చెడు వార్తలు వినాల్సివస్తుంది. ఒక ముఖ్యమైన పని వాయిదాపడుతుంది. భార్యకు ఉద్యోగ అవకాశం వస్తుంది. స్త్రీల నుండి అధికారుల నుండి ప్రోత్సాహం లభిస్తుంది.



ధనుస్సు: Sagittarius (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1): త్వరలో జరుపవలసిన శుభకార్యాల గురించి తగిన ఏర్పాట్లు చేసుకుంటారు. అధికారంలో ఉన్నటువంటి మిత్రుల సహాయంతో అనుకున్న పనులు పూర్తిచేసుకుంటారు. వృత్తిలో చేయాలనుకున్న మార్పు లు వాయిదాపడతాయి. ఎక్కువగా ప్రయాణాలు చేయడం వలన బడలికకు గురవుతారు.



మకరం: Capricorn (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2): బంధువులు, వైద్యం గురించి ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. ఋణాలు తీర్చే ప్రయత్నం చేస్తారు. స్త్రీల వలన ఇబ్బందులు వస్తాయి. అనవసర ప్రయాణాల వలన ధనం వృథా అవుతుంది. డబ్బు విషయంలో బంధువులతో విరోధాలు వస్తాయి. వాహన ప్రయాణాలు చేయునప్పుడు జాగ్రత్త వహించడం మంచిది.



కుంభం:Aquarius (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3 ధనలాభం ఎక్కువగా ఉన్నది. గుప్త ధనలాభం కలుగుతుంది. దీర్ఘకాలంగా ఉన్న సమస్యలు పరిష్కరించబడతాయి. మిత్రులకు ఉచిత సలహాలు ఇస్తూ సహాయం చేస్తారు. కుటుంబ విషయంలో అశ్రద్ధ వహించడం వలన భార్య నుండి విమర్శలు ఎదుర్కొంటారు. అధికారులకు లంచం ఇచ్చి మీ పనులు పూర్తి చేసుకుంటారు. లివర్ సంబంధిత వ్యాధులు కలుగుతాయి. కోర్టు సమస్యలు పరిష్కరించబడతాయి.



మీనం:Pisces (పూర్వాభాద్ర -4,అనుకున్న పనులు అన్నీ వాయిదాపడతాయి. నమ్మినవారి వలన మోసపోతారు. మీ సొంత వ్యవహారాల్లో ఇతరుల జోక్యం వలన అసహనానికి గురవుతారు. మీ మంచితనాన్ని ఎదుటివారు స్వలాభం కోసం ఉపయోగించుకుంటారు. తల్లిగారి ఆరోగ్య విషయంలో ఆందోళన కలుగుతుంది.



నీవు గెలిచి తీరతావు అంటే విజయానికి ఆత్మవిశ్వాసమే ముఖ్యమన్న మాట. -విలియం హాడ్‌లిట్

# ఆలయం

**మూడు దేవాలయాల సమాగయంగా ఉన్న రాక్‌ఫోర్ట్ తమిళనాడులో తిరుచ్చి (తిరుచిరాపల్లి)లో ఉన్నది. పర్వత పాదాల వద్ద మనిక వినాయకర్ దేవాలయం ఉండగా...**

# రాక్‌ఫోర్ట్ టెంపుల్

పేరుకు తగ్గట్టు రాక్‌ఫోర్ట్ టెంపుల్... పర్వతంపై 83 మీటర్ల ఎత్తున శిలలో అత్యద్భుతంగా మలచబడింది. ఈ కొండపై మొత్తం మూడు దేవాలయాలు ఉన్నాయి. ఈ దేవాలయ సముదాయాల నిర్మాణం పల్లవుల హయాంలో ప్రారంభమైనప్పటికీ... ఆ తరువాత విజయనగర రాజుల ఆధ్వర్యంలో మధురై నాయకులు వీటి నిర్మాణాన్ని పూర్తిచేశారు. వీరికాలంలో దేవాలయం ఎంతగానో అభివృద్ధి చెందింది. ఏకశిలను తొలిచి నిర్మిం చిన రాక్‌ఫోర్ట్ పర్వత శిఖరానికి... ఎంతో కఠినతరమైన 437 ఎగుడు మెట్లు ఎక్కితే గాని చేరుకోలేం. మూడు దేవా లయాల సమాగయంగా ఉన్న రాక్‌ఫోర్ట్ తమిళనాడులో తిరుచ్చి (తిరుచిరాపల్లి)లో ఉన్నది.

పర్వత పాదాల వద్ద మనిక వినాయకర్ దేవాలయం ఉం డగా... పర్వత శిఖరం వద్ద ఉచ్చి పిల్లయార్ కోయిల్ దేవస్థా నం ఉంది. ఇక్కడ... ప్రసిద్ధిగాంచిన శివాలయం తాయుమనస్వామి దేవాలయం ఉన్నది. శిలను చెక్కి అవు రూ ఎంగా మలిచిన ఈ శివస్థలం పర్యాటకులను కనురె ప్పవేయనీయదు. ఇక్కడ ఉన్న దేవాలయ సము దాయంలో... లలితాంకుర పల్లవేశ్వరం అనే పల్లవులు నిర్మించిన దేవాలయం కూడా ఎంతో ప్రఖ్యాతిపొందినది. ఇక్కడ ఎన్నో అరుదైన శాశనాలు పల్లవ రాజు మంహేంద్ర పల్లవన్ గురించి అనేక విశేషాలను తెలియజేస్తాయి. చోళ లు, విజయనగర రాజులు, మధురై నాయకులు ఈ దేవాలయాన్ని విశేషంగా అభివృద్ధి చేశారు. అంతేకా కుండా, కొండపై ఉన్న రెండంతస్థుల తాయుమనస్వామి దేవాలయం ఇక్కడి నిర్మాణాల్లోనే తురుపుముక్కగా అనడం లో ఎలాంటి సందేహం లేదు. అద్భుత కళానైపుణ్యం ఈ దేవాలయం సొంతం. ప్రతిరోజు ఇక్కడ ఆరు రకాల పూజలు జరుగుతాయి. చితిరైలో ప్రతియేటా ఒకసారి బ్రహ్మోత్సవం కూడా జరుగుతుంది. ఆదిపూరం, ఫ్లోట్ ఫెస్టివ ల్ జరిగే పంగుని ప్రదేశం కూడా ఇక్కడ ఎంతో ప్రఖ్యాతి పొందిన ప్రదేశం. మధురై నాయకులు నిర్మించిన ఈ రెండు దేవాలయాల్లో ఒకటి శివాలయం కాగా, మరొకటి గణేష్ దేవస్థానం. అద్భుత శిల్పకళారీతులకు ఆలవాలంగా ఉన్న... 7వ శతాబ్దానికి చెందిన దేవాలయాలు ఇవి. ప్రఖ్యాతి గాంచిన ఎన్నో శిల్పరీతులకు పెట్టింది పేరు. పర్వత పాదాల వద్ద ఉన్న వినాయకుడి దేవస్థానం, అలాగే పర్వత శిఖరం వద్ద ఉన్న అతిపెద్ద శ్రీ తాయుమాన స్వామి దేవాలయాల్లోకి హిందూయేతరులను అనుమతించరు.

పర్యాటకుల సందర్శనార్థం ప్రతిరోజూ ఉదయం 6 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు ఈ ఆలయాలను తెరిచి ఉంచుతారు.

**వినాయక దేవస్థానం...** లంకాధీశుడైన రావణుడి అనుంగు సోదరుడైన విభీషణుడు... అపహరణకు గురైన సీతాదేవిని రక్షించేందుకు రాముడి పక్షాన చేరి తన సహాయ సహకారాలను అందిస్తాడు. తరువాత యుద్ధంలో రావణుడి ఓడించిన రాముడు తన ధర్మపత్ని సీతను కాపాడుకు ంటాడు. ఈ నేపధ్యంలో తనకు సహాయాన్ని అందించిన విభీషణుడికి ఏదైనా బహుమతి ఇవ్వాలనే ఉద్దేశంతో రాముడు... విష్ణుమూర్తి అవతారమైన రంగనా థస్వామి విగ్రహాన్ని ఇస్తాడు. అయితే ఇది గమనించిన దేవతలు... ఒక అసురుడు విష్ణుమూర్తి అవతారమైన రంగనాథస్వామి విగ్రహాన్ని తన రాజ్యానికి తీసు కెళ్ళడాన్ని సహించలేక పోతారు. దాంతో, దేవతలు ఎలాగైనా విభీషణుడు ఆ విగ్ర హాన్ని తీసుకెళ్ళకుండా ఆపాలని నిశ్చయించుకొని విఘ్న నాయకుడైన వినాయకుడి సహాయం కోరుతారు. అప్పుడు వినాయకుడు వారి కోరికను మన్నిస్తాడు. రాముడు ప్రసా దించిన విగ్రహాన్ని తీసుకొని లంకకు బయలుదేరిన విభీష ణుడు కావేరీ నది మీదుగా వెళ్తూ... ఆ నదిలో స్నానం చేయాలని భావిస్తాడు. ఆ సమయంలో ఆ విగ్రహాన్ని ఎవరికైనా ఇవ్వాలనుకుంటాడు. ఎందుకంటే, ఒకసారి ఆ విగ్రహాన్ని నేలపైన పెడితే మళ్లీ తీయడం అసంభవం. దాంతో ఏం చేయాలి? అని మదనపడుతున్న సమయంలో అక్కడే పశువులను కాస్తున్న బాలుడిలా మారువేషంలో ఉన్న వినాయకుడి చేతికి ఆ విగ్రహాన్ని అందించి... విభీషణుడు స్నానానికి ఉపక్రమిస్తాడు. విభీషణుడు నదిలో మునగగానే మారువేషంలో ఉన్న వినాయకుడు ఆ విగ్రహాన్ని కావేరీ నది తీరంలో ఉన్న ఇసుకపై పెడతాడు (ఆ విగ్రహం పెట్టిన చోటే... నేడు ప్రపంచంలోనే అతిపెద్ద దేవాలయంగా విరాజిల్లుతున్న రంగనాథస్వామి దేవాలయం). ఇది గమనిం చిన విభీషణుడు పశులకాపరిని తరుముతూ వెంబడిస్తాడు. దీంతో ఆ బాలుడు పక్కనే ఉన్న కొండపైకి చకచకా ఎక్కేస్తాడు. విభీషణుడు కూడా ఆ కొండపైకి ఎక్కి ఆ బాలుడి నుదిటిపై ముష్టిఘాతం కురిపిస్తాడు. అప్పుడు మారువేష ంలో ఉన్న ఆ బాలుడు వినాయకుడిగా మారిపోతాడు. అప్పుడు తన తప్పును తెలుసుకొని వినాయకుడిని క్షమాపణ వేడు కుంటాడు విభీషణుడు. ప్రసన్నుడైన విఘ్నరాజు విభీషణుడి దీవించి లంకకు పంపిస్తాడు. వినాయకుడు ఎక్కిన ఆ కొండనే ఈ రాక్‌ఫోర్ట్ టెంపుల్. అక్కడ వెలిసిన వినాయకుడి దేవస్థానమే ఉచ్చి పిల్లయార్ దేవాలయం.

> **వినాయక దేవస్థానం...**
>
> లంకాధీశుడైన రావణుడి అనుంగు సోదరుడైన విభీషణుడు... అపహరణకు గురైన సీతాదేవిని రక్షించేందుకు రాముడి పక్షాన చేరి తన సహాయ సహకారాలను అందిస్తాడు. తరువాత యుద్ధంలో రావణుడి ఓడించిన రాముడు తన ధర్మపత్ని సీతను కాపాడుకు ంటాడు. ఈ నేపథ్యంలో తనకు సహాయాన్ని అందించిన విభీషణుడికి ఏదైనా బహుమతి ఇవ్వాలనే ఉద్దేశంతో రాముడు... విష్ణుమూర్తి అవతారమైన రంగనా థస్వామి విగ్రహాన్ని ఇస్తాడు.



**తాయుమనస్వామి...** వినాయుడి దేవస్థానానికి ఉన్నట్లే, ఈ గుడికి కూడా పురాతన గాథ ప్రచారంలో ఉంది. ఒకనాడు శివభక్తురాలైన రత్నవతి అనే ఆవిడ పురిటినొప్పులతో బాధపడుతూ తన తల్లి రాకకోసం ఎదురుచూస్తుంది. ఎంతసేపటికీ తన తల్లి రాకపోవడంతో... నన్ను ఎలాగైనా రక్షించు స్వామీ అని శివుడిని వేడుకుంటుంది. అప్పుడు శివుడే స్వయంగా రత్నవతి తల్లి రూపంలో వచ్చి పురుడు పోస్తాడు. అప్పటినుండి ఆయనకు తాయుమనస్వామి అనే పేరు స్థిరపడిపోయింది (తాయుం – అన – స్వామి అంటే... తల్లి రూపంలో వచ్చిన భగవంతుడు అని అర్థం). అప్పటినుండి ఈ దేవాలయానికి తాయుమనస్వామి దేవాలయం అనే పేరు సార్థకమైంది. పర్వతపాద ప్రాంతం నుండి సుమారు రెండు వందల అడుగుల ఎత్తులో ఉన్న ఈ దేవాలయం ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. దేవాయం పైకప్పుపై ఉన్న పెయింటింగ్స్ సందర్శకులను మైమరపిస్తాయి. ఈ ఆలయ నిర్మాణం ఆనాటి పల్లవుల శిల్పకళా నైపుణ్యానికి అద్దం పడతాయి. ఇక్కడ శివపార్వతులతో పాటు మహాలక్ష్మి విగ్రహం కూడా ఉండడం విశేషం.




ప్రపంచంలో వున్న వేడి మొత్తానికి సూర్యుడే మూలం. ఆ వేడే భౌతిక మనుగడకు కారణం. కొంత సమయం వరకు సూర్యుడి వేడి భూమి మీద ప్రసరించడం మానేస్తే అంతా గడ్డకట్టకు పోతుంది. ఎంత లా అంటే మన ఒంట్లో వున్న రక్తం కూడా గడ్డకట్టి ప్రాణాలు కోల్పోతాము. అంత శక్తి వంతమైనది సూర్యుడి నుండి వెలువడుతున్న వేడి.

# కార్తీకదీపం మార్గాన్ని చూపుతుంది

మనం తీసుకుంటున్న ఆహారంలో నిగూఢంగా దాగి వున్న శక్తి కూడా సూర్యుడిదే. వాస్తవానికి ప్రాణి భౌతిక మనుగడ సూర్యుడిపైనే ఆధారపడి వుంది. అందుకే భారతీయ సనాతన ధర్మంలో సూర్యుడికి అంత ప్రాముఖ్యతనిచ్చింది..సూర్యుడు అంటే మరేదో కాదు లోకానికంతటికి వెలుగును పంచుతూ మన దీపం ఆరిపోకుండా నిలబెట్టే మహాదీపం. మహా కారుణ్యమూర్తి అయిన సూర్యభగవానుడు మనలో వున్న దైవికమైన గుణాలను వెలికి తీసి మనలను దివ్యాత్ములుగా తీర్చి దిద్దటానికి కార్తీక మాసంలో మనకు దూరంగా వెళతాడు. అలా దూరంగా వుండటానికి కారణం కేవలం మనలోని దివ్యత్వాన్ని వెలికి తీయటానికే అని మరిచిపోకూడదు. సూర్యుడు మనకు దూరంగా వెళ్ళడం వల్ల ప్రకృతిలో ఎన్నో రకాల మార్పులు వస్తాయి. రోగాలు ప్రబలిపో తాయి, చలికి ఒణుకు పుడుతుంది. వృద్ధులకు,పిల్లలకు ఎంతో ఇబ్బంది కలుగుతుంది. యమ ధర్మరాజు తన చేతులుజాపి ఎదురు చూస్తుంటాడు. రక్తంలోని కొవ్వు గుండె కవాటాలు పని చేయకుండా అడ్డుపడుతుం టుంది. ఈ పరిస్థితులలో మానవాళి శ్రేయస్సుకోసం మానవ రూపంలో వున్న భగవంతులు ప్రకృతిలో ప్రబలే విపరీతాలను అడ్డుకుంటూ మానవాళి మొత్తానికి మేలుజరిగేలా మహాసంకల్పంతో దీపాలను వెలిగిస్తారు.

అదే కార్తీక దీపోత్సవం. కార్తీక మాసంలో నియమనిష్ఠ లతో ఉపవాస దీక్ష చేస్తూ దీపాలు పెట్టే ప్రతి ఒక్కరూ ప్రకటిత పరమాత్మలే. సూర్యుడు ఈ కాలంలో భూమికి దూరంగా వుండటంతో ఈ భూమిపైన ఎటువంటి విపరీతాలు జరగకుండా దీపం ద్వారా దైవిక శక్తిని వేడిరూపంలో, వెలుగుల రూపంలో ప్రసరింప చేసి మాన వులు ప్రమాదంలో పడకుండా సాధకులు అడ్డకుంటారు. కార్తీక మాసంలో చేసే సాధనలు వ్యక్తి గతంగా మనకు మాత్రమే కాకుండా సమాజానికి ఎంతో మేలుచేస్తాయి. సూర్యభగవానుడు ఈ కాలంలో మనకు దూరంగా వుండి కొన్ని కోట్లమంది భక్తుల హృదయాల్లో జ్ఞాన దీపాలను వెలిగిస్తున్నాడు. ఈ కార్తీకమాసం పార్వతీ పరమేశ్వరు లకు ప్రీతికరం అనడానికి కారణం ఇదే. సృష్టి స్థితి ప్రళ య కారకుడైన ఆ పరమేశ్వరుడికి ఈ కాలం ఇష్టం. ఆకా లం అయిష్టమని వుంటుందా? వుండదు కాక వుండదు. ఆ ఆది దంపదులకు ఈ కాలం ఇష్టమవడానికి కారణం హిందూ ధర్మ ఆచరణా పరులు కోటి సూర్యుళ్లై ఒక్క తాటిపై నిలబడి దీపాలను వెలిగించి ప్రకృతిలో అజ్ఞా నాంధకారాలను పార్రదోలి వెలుగుని నింపుతున్నారు అందుకే కార్తీకమాసంలో ఉపవాస దీక్షతోపాటు ఉభయ సంధ్యలలో దీపారాధన చేసి శివపార్వతుల అనుగ్రహాన్ని పొందుతున్నారు. ఉన్నతమైన ఆలోచనలతో దీపాన్ని పరబ్రహ్మగా భావిస్తు మానవాళి మేలుకోసం సాధనలు చేసే బిడ్డలను చూసి ఈ కాలంలో పార్వతీ పరమేశ్వరులు ఆనంద తాండవం చేస్తుంటారు. అగ్రిహోత్రానికి మన సంకల్పాలను గ్రహించి జ్ఞాపకం పెట్టుకునే శక్తి వుం టుంది. మన పాపపుణ్య కర్మలను నిర్ణయించి తరువాత జన్మలు తీసుకోవడంలో పంచభూతాల్లో అగ్ని పాత్ర చాలా కీలకమైనది. ఈరోజు నువ్వు వెలిగిం చిన దీపం మానవాళి శ్రేయస్సుకు ఉప యోగప డింది కాబట్టి ఇదే అగ్ని హోత్రం సాక్ష్యంగా నిలిచి ఈ జన్మలోనే పాప ప్రక్షా ళన చేసి ఉత్తమగతులు పొం దేలా పరమశివుడి సన్ని ధికి చేరేలా సహకరి స్తుంది. కార్తీక మాసంలో పెట్టే ఒక్క దీపం ముక్తికి మార్గాలన్నీ చూపుతుంది.





-శ్రీకాంత్ కొణపర్తి
స్పిరిట్యువల్ కౌన్సిలర్,
Srikanthkonaparthy@gmail.com



ఆనందం కలిగినప్పుడు అది నలుగురికీ పంచిపెట్టు. కాని విషాదం సంభవించినప్పుడు మాత్రం అది నీ దగ్గరే దాచుకో. -సుభాషిత రత్నావళి

# వావ్!







# 'ద్వీపా'వళి



ప్రకృతి చెక్కని రూపాలం...పర్యాటకులకు నేస్తాలం...
ప్రశాంతతకు చిరునామాలం...ప్రేమికులకు స్వర్గధామాలం...
పరవశించే అలల తీరాలం...పచ్చని చెట్లతో స్వాగతిస్తాం...
పరవళ్లు తొక్కే కెరటాలనాపేస్తాం...పండుగలా తలపించే దీపాలం...
ప్రణయప్రబంధ కావ్యకల్పిత అద్వితీయ ద్వీపాలం...















